సుద్దాల అశోక్ రచనావళి - 2

# వీర తెలంగాణ

## సాంఘిక యక్షగానం



సుద్దాల హన్మంతు

సుద్దాల అశోక్

ప్రచురణ

వెలుగు కళా వేదిక

మేడిపల్లి (పడమర)

తొలికిరణం.

VEERA TELANGANA SANGIKA YAKSHAGANAM

by

SUDDALA HANUMANTHU and SUDDALA ASHOK


© సుద్దాల అశోక్

Acc. No. 274

ప్రథమ ముద్రణ ఆగస్టు 1988

వేయి ప్రతులు

వెల : రూ. 20/-

ముఖచిత్రం
మోహన్ - (ఉదయం)

ముద్రణ
శ్రీలక్ష్మి వేంకటేశ్వర పవర్ ప్రెస్
హిమాయత్‌నగర్, హైదరాబాదు.

ప్రతులకు
సుద్దాల అశోక్
పోస్ట్ : మేడిపల్లి (పడమర)
వయా : మెట్టుపల్లి - 505325
కరీంనగర్ జిల్లా.

మరియు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
ఆబిడ్స్, హైదరాబాదు

విశాలాంధ్ర బుక్ హౌస్,
విశాఖపట్నం, తిరుపతి, విజయవాడ,
హన్మకొండ, గుంటూరు, కాకినాడ, అనంతపురం.

# సమర్పితం

అమ్మా !

నాటి తెలంగాణ పోరుబాటలో
నాన్నతోపాటు నడిచింది నువ్వే.
ఆనాటి రక్తకన్నీటి వాస్తవాలను
కన్నీళ్ళతో
చరిత్రగా నా కందించింది నువ్వే.
పుస్తక ప్రపంచాలను నా మేధస్సు
లోకి
దండయాత్ర చేయించిందీ నువ్వే
నా రచనా దీపావళికి చమురువి నువ్వే.
నా చదువుకి, బతుక్కి.........నా
సమస్త చైతన్య శక్తికీ,
అర్థం, పరమార్థం నువ్వే నమ్మా
నువ్వే.
అందుకే
మా 'వీరతెలంగాణ' యక్షగాన గ్రంథాన్ని
అందుకోవాలి.........నువ్వే

నీ పెదబాబు
సుద్దాల అశోక్



కృతిస్వామిని

శ్రీమతి సుద్దాల జానకమ్మ

శ్రీ రావి నారాయణరెడ్డి
వీరతెలంగాణ పోరాట నాయకులు

హైదరాబాదు
తేది. 4-7-88

# శుభాకాంక్షలు

సుద్దాల హనుమంతు, అతని కుమారుడు సుద్దాల అశోక్ సమిష్టిగా రచించిన వీరతెలంగాణా యక్షగానమును పూర్తిగా చదువలేకపోయినాను. ఓపిక లేక అక్కడక్కడ చూచాను. దీనికి నా వృద్ధాప్యము, అనారోగ్యము కారణము. తండ్రి సుద్దాల హనుమంతు కొంత వ్రాసి అమరుడైనందున దానిని కుమారుడు అశోక్ పూర్తి చేసినాడు.

ఈ యక్షగానము తెలంగాణాలో ఫ్యూడల్ విధానమునకు వ్యతిరేకముగా జరిగిన చరిత్రాత్మక పోరాటమునకు చక్కగా అద్దం పట్టింది. తెలంగాణాలో ఒక గ్రామము- ఆ గ్రామములో దొర, పట్వారి ఇద్దరుకల్సి ఆ గ్రామ ప్రజలపై అమలు జరిపిన, వెట్టిచాకిరి, అక్రమ వసూళ్లు, హత్యలు మొదలగు ఫ్యూడల్ దౌర్జన్యములు, వాటికి వ్యతిరేకముగా ప్రజలు జరిపిన పోరాటము, చివరకు దొర పట్వారి ఇద్దరు ప్రజలచేత మరణశిక్షకు గురికావటము..........స్థూలంగా ఈ యక్షగానము యొక్క ఇతివృత్తం. నాడు జరిగిన ఘోరాల్ని వున్నదున్నట్లుగా తండ్రి ఆశయాల మేరకు రచించిన శ్రీ సుద్దాల అశోక్‌కు నా శుభాకాంక్షలు.

రావి నారాయణరెడ్డి

డా॥ సి. నారాయణరెడ్డి
M A, Ph.D., D. Litt.
వైస్ చాన్స్‌లర్.
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

హైదరాబాదు

తేది. 22-7-1988

# అభినందన

తెలంగాణా రైతాంగ పోరాటాన్ని తలచుకుంటే చాలు; సుద్దాల హన్మంతు పాటలు దూసుకొస్తాయి ఈటెలు ఈటెలుగా.

హన్మంతు తెలంగాణా జానపద బాణీలను, పలుకుబళ్లను పాటల్లో కుదించిన అసలుసిసలు ప్రజాకవి.

'వీరతెలంగాణ'లో అనుసరించిన యక్షగాన రీతులు, పాత్రల ప్రవేశం, దరువులు, సంభాషణలు అత్యంత సహజంగా రూపొందాయి. పాటను పాటలా గతుకులు లేకుండా నడపడం అందరికీ సాధ్యంకాదు. తండ్రి గేయ సంప్రదాయాన్ని జీర్ణించుకున్నవాడు కాబట్టి, సుద్దాల అశోక్ చేతిలో పాటల దరువులు సెలయేళ్లలా పరుగులెత్తాయి.

నిజాం పాలనలో మగ్గుతున్న రైతాంగం పరిస్థితిని కళ్లకు కట్టినట్లు చిత్రించిందీ యక్షగానం. అప్పటి రైతు ఉద్యమాన్ని ఇప్పటికీ గుండెలుబికేంత ఊపులో ప్రదర్శించిన బలమైన రచన యిది.

సుద్దాల హన్మంతు ప్రారంభించిన ఈ 'వీరతెలంగాణ' సాంఘిక యక్షగానాన్ని సమర్థంగా పూర్తిచేసి అశోక్ అక్షరాలా అతని వారసుడనిపించుకున్నాడు. ఈ రచనను ఇంత బలంగా రూపొందించిన కీ. శే. హన్మంతుకు నా జోహార్లు. అశోక్‌కు నా ఆశీస్సులు. దీన్ని వెలువరించిన వెలుగు కళావేదికకు నా అభినందన.

సి. నారాయణరెడ్డి

డా॥ జయధీర్ తిరుమలరావు
తెలుగు విశ్వవిద్యాలయం
సాహిత్యపీఠం, రాజమండ్రి.

తేది. 1-7-1988

# ప్రజాసాహిత్యపు తోటలో విరిసిన 'వీరతెలంగాణా'

ప్రజలకు సంబంధించిన ఒక 'సంఘటన' పాటై, గాథై, జానపదుల జీవితంలో ఒక భాగంగా కళారూపమై కొన్ని మార్పులతో ప్రచారం పొందుతుంది. ఇది నోటిద్వారా ప్రచారమవుతుంది. సన్యాసమ్మ కథ, ఆలేరువాగు ప్రమాదం మొదలైన వాటికి రాత సాహిత్యంలో జగా ఉండదు. ప్రజా వ్యవహారంలో తప్ప. ఇట్లే ఈ 'సంఘటన'లు ఒక జాతి జనులకు సంబంధిస్తే మాత్రం అది ఒక గొప్ప కథావస్తువుగా ఉపయోగపడ్తుంది. దీన్ని ఉపరితలవర్గాలు స్వీకరిస్తాయి. తమకు ఉపకరించే రీతిలో (Interpret) వాడుకుంటాయి. స్థానిక, ప్రాంతీయ, దేశ, దైవ భాషల్లోకి ఈ కథావస్తువు ఎగుమతి అవుతుంది. ఉదా: రామాయణం, భారతం.

భార్యను ఎత్తుకుని పోయిన రాక్షసుణ్ణి, భూమిని (ఊళ్ళను లేదా రాజ్యాన్ని) లాక్కున్న దుర్యోధనుణ్ణి ఎదుర్కొని, పోరాడి హతమార్చిన మూలకథ నానా రకాలుగా మార్పు చెందింది. 'తండ్రిమాట జవదాటరాదు' అన్నమాట. గౌరవించాలి అనే విలువల ప్రచారం రానురాను ఎక్కువయ్యాయి.

అలాగే తెలంగాణా రైతాంగ పోరాటం ప్రభావంలోంచి అనేక కళారూపాలు వెలువడ్డాయి. అవి చాలావరకు ఎక్కడా అచ్చుకాలేదు. కొన్ని అచ్చయినా గుజిలీ ప్రతులుగా (అతి తక్కువ ధర) వెలువడ్డాయి. అంటే సాహిత్యంగా గుర్తింపు పొందని రీతిలో వెలువడ్డాయి. కానీ ఇవ్వాళ సాహిత్య తెరపైకి ఒక్కొక్కరే వస్తున్నారు. సాహిత్యంలో తమ స్థానంకోసం ప్రశ్నిస్తున్నారు.

పోరాటం జరిగిన నలభై ఏళ్ల తరువాత కూడా ఇవ్వాళ కళారూపాలు వెలువడుతున్నాయి. సుద్దాల తండ్రి తనయులు ఈ రచనకి సాహిత్యంలో 'జాగా' ఇవ్వక తప్పనట్లుగా ఈ రచన చేశారు. ఈ పోరాటాన్ని ఇంకా ఉపరితల వర్గాలు తమకు అనువుగా ఉపయోగించుకునే స్థితిలేదు. కారణం నేటికీ ఏదో ఒక రూపంలో పోరాటం కొనసాగడమే. అందుకే వ్యక్తీకరణతో కాకుండా కొన్ని పరిమితులతో, పరిధులతో ఇలాంటి రచనలు వస్తున్నాయి.

ఉపరితలవర్గాల సాహిత్యంలో ఒక భాగం కాకుండా ప్రజాసాహిత్యంలో భాగంగా వచ్చిన ఈ రచనకి నా సుస్వాగతం !

* * *

ఈ రచనలో కేవలం వస్తువేకాదు, రూపం కూడా ప్రజలదే. భాష, భావ వ్యక్తీకరణ అన్నీ తెలంగాణా ప్రజలవే.

ఇదంతా ప్రజాకవి సుద్దాల హనుమంతు రాస్తే ఆశ్చర్యంలేదు. సుద్దాల అశోక్ రాసాడని సంతోషం.

సరిగ్గా పదేళ్ల కింద పాటలకోసం క్షేత్రపర్యటనలో భాగంగా సుద్దాల గ్రామానికి వెళ్లి హనుమంతుగారిని కలిసాను. నాటినుండి ఆయన మరణించే వరకు నాకు ఆప్తులు. ఆనాడే ఈ యక్షగానంలో తను రాసినవి, పాడి వినిపించారు. దాన్ని పూర్తి చేయాలనే సంకల్పాన్ని అశోక్ ఇవ్వాళ నెరవేర్చాడు. అందుగ్గాను పోరాట చరిత్రని తెలుసుకున్నాడు. యక్షగాన ప్రక్రియని నేర్చుకున్నాడు. రక రకాల దరువుల్లో రచన చేశాడు. ఇలాంటి శక్తిమంతమైన ప్రజాకళారూపం 'సగం' భాగం గురించే చెప్పవలసి వచ్చినందుకు బాధగా ఉంది. ఎందుకంటే ప్రదర్శన నేను చూడలేదు.

ఇలాంటి కళారూపాల 'శక్తి' ప్రదర్శనలోనే తెలుస్తుంది. ఇప్పుడు రాతలో కనిపించే ప్రతిమాట 'ధ్వని'గా ఎంతో బలంగా ఉంటుంది. ఈ ధ్వనికి తోడు హావభావాలు జతై ప్రేక్షకులను తన్మయులను చేస్తుంది. ఇది సహజ ప్రదర్శన. ఇక్కడ ప్రదర్శనలో ప్రేక్షకులు కూడా భాగస్వాములౌతారు. ఒక

సామూహిక భావవాతావరణం అలుముకుంటుంది. 'రచన'లోని ప్రతి అక్షరం లోని భావం ప్రేక్షకునిలో వెయ్యిరెట్లు బలంగా హత్తుకుంటుంది.

అందుకే ఇలాంటి కళారూపాల సాహిత్య విలువల్ని ఉపరితలవర్గాల సాహిత్య విలువలతో పోల్చకూడదు. ప్రజాకళల్ని పునాది, ప్రయోజనం, ప్రేక్షకులమీద చూపే ప్రభావం మొదలైన అంశాలతో గ్రహించాలి. ఆ రకంగా చూస్తే ఈ యక్షగానం ఇతర యక్షగాన సాహిత్యం కన్నా భిన్నమైందే కాదు విశిష్టమైంది కూడా!

* * *

తెలంగాణాలో యక్షగానాలనే వీధినాటకాలని అంటారు. ఈ యక్షగానాలు గుజిలీప్రతుల రూపంలో చాలా ప్రచారం పొందాయి. పోరాట కాలంలోనే చలమచర్ల రంగాచారిగారు 'ఆంధ్రపితామహ జీవితచరిత్ర' (మాడపాటి హనుమంతరావు) రాశారు. ఈ పోరాట ప్రభావంతోనే పొట్టిపల్లి వీరప్ప 'క్రోధాపురి రైతు విజయం' (1953) రాశారు. అంతే తప్ప యక్షగానాలు వచ్చిన దాఖలాలు లేవు. తెలంగాణాలో యక్షగానానికి ప్రాధాన్యత ఉంది కాని యక్షగానం ప్రదర్శన కాస్త భారంతో కూడుకొన్నది కాబట్టి కళాకారులు ఈ ప్రక్రియని ఎక్కువగా స్వీకరించలేదు.

* * *

సుద్దాల అశోక్ కవేకాదు, తండ్రిలాగే కళాకారుడు కూడా. అందుకే యక్షగాన రచన చేసాడు. ప్రదర్శన పద్ధతి ఔపోసన పట్టాడు. ఇప్పటికే ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి. రాత సాహిత్యానికి లేని సౌలభ్యం దీని కుంటుంది. ఒక పుస్తకం ఒకచోట బంధింపబడుతుంది. కాని ఒక ప్రదర్శనని వేలాది మంది చూస్తారు. ఎన్నో ప్రదర్శనదశాలు తయారవుతాయి. ప్రతి ప్రేక్షకునిలో ఒక 'పాఠ్యం' తయారవుతుంది ఆ రకంగా ఈ యక్షగాన పాఠ్యం **(Text)** ఈ పుస్తకంలో ఉన్నదేకాదు కొంత అదనంగా చేరుతుంది కూడా! అంటే 'పొడగింపు'నకు లోనవుతుంది.

నైజాం లొంగుబాటు వరకే కథని తీసుకున్నప్పటికీ అరవై పూళ్ళ దొరని ప్రజలే శిక్షించిన ఘట్టంతో భూస్వామ్య వ్యతిరేక ప్రజావిజయానికి ప్రాధాన్యం ఇచ్చారు. అంతేకాదు ఒక స్త్రీని ప్రధానపాత్రచేసి ప్రజాబలంతో 'విసునూరి దొర'లాంటి రామిరెడ్డిని, దుష్టుడైన కరణం పంతుల్ని హతమారుస్తారు. దీంతో యక్షగానం పూర్తవుతుంది. కాని వాస్తవానికి పోరాటం ఆ తరువాత కూడా కొనసాగింది. సుద్దాల హనుమంతు పోరాటం చివరి అంచుదాకా తన గళాన్ని అంకితం చేశాడు.

చివరలో గాంధీకి, అల్లూరికి, భగత్సింగుకి జోహార్లు చెప్పారేకాని ప్రజా కవుల్ని, కళాకారుల్ని స్మరించుకోలేదు. ఇది కేవలం యాదృచ్ఛికం కాదు. ఈ కవులకి సాహిత్యంలో స్థానం లేనట్టే చరిత్రలో కూడా పెద్ద చెప్పుకోదగిన స్థానం లేదనే దృక్పథం జీర్ణించుకుని పోవడంవల్ల ఇలా జరిగిందేమో!

కాని ఈ పోరాటంలో ప్రజాకవుల, కళాకారుల పాత్ర చిన్నదికాదు. నేటి వర్తమాన రాజకీయాల వెలుగు ఆ చీకటి తెరల్ని తొలగిస్తోంది. ప్రజాసాహిత్యం తన స్థానం తాను ఆక్రమించుకుంటుంది. ప్రజాకవులు నీరాజనా లందుకునే రోజు దగ్గర్లోనే ఉంది. అందాక 'వీరతెలంగాణ' నాటక ప్రదర్శనలు వెలువడుతూనే ఉండాలి!

—జయధీర్ తిరుమలరావు

డా॥ జి. హరగోపాల్
కేంద్రీయ విశ్వవిద్యాలయం

హైదరాబాదు
తేది. 8-7-1988

# బలమైన కళారూపం

భారతదేశ చరిత్రలో తెలంగాణా పోరాటాని కొక ప్రత్యేక స్థానముంది. ఒకవైపు స్వాతంత్రోద్యమం సాగుతుంటే, అదే తరుణంలో భూస్వామ్యానికి వలస వాదానికి వ్యతిరేకంగా పునాదిలో జరిగిన కొద్ది పోరాటాలలో తెలంగాణా పోరాటం ఒకటి. పోరాటం ఏం ఫలితాలనిచ్చిందన్న ప్రశ్నతోపాటు అది ఏం అనుభవాన్నిచ్చిందన్నది కూడా ముఖ్యమైన ప్రశ్నే. ఈ అనుభవం సమకాలీన ఉద్యమాలకు స్ఫూర్తి నివ్వడమేకాక సామాజిక పునర్నిర్మాణానికి ఎంతో ఉపకరిస్తుంది. ఇంత లోతైన సామాజిక అనుభవాన్ని అనుభవంలోని చైతన్యాన్ని ఇంతవరకు సరియైన, సమగ్రమైన, శాస్త్రీయమైన విశ్లేషణ చేయకపోవడం గమనార్హం. ఆ కాలంలో వచ్చిన సాహిత్యం కొంతవరకు విశ్లేషించబడింది. కాని ఆ ఉద్యమాన్ని ఆధారం చేసుకొని తర్వాత కాలంలో సాహిత్యసృష్టి ఏమంత జరగలేదు. అలా సృష్టించడం కష్టం కూడా. 1970 నుండి వచ్చిన సాహిత్యానికి సమకాలీన ఉద్యమాలు ఊపిరి పోసాయి కాని, తెలంగాణా ఉద్యమం కాదు. ఈ నేపథ్యంలో పరిశీలిస్తే 1988లో ప్రచురిస్తున్న సుద్దాల హన్మంతు, అశోక్ గారల వీరతెలంగాణ సాంఘిక యక్షగానం మంచి రచనయనే చెప్పాలి.

యక్షగాన కళాప్రక్రియ గురించి తెలియని నాలాంటి వారికక్కూడా ఈ రచన చదివినప్పుడు ఇది చాలా బలమైన ప్రజాకళా రూపమని అనిపిస్తుంది. ముఖ్యంగా సామాన్యప్రజలనుండి సామాన్యప్రజలకొరకు వచ్చిన కళారూపంలో సరళత, స్పష్టత ముడివేసుకొని ఉంటాయి. ఇది మధ్యతరగతి సాహిత్యానికి ప్రజాకళకుండే ప్రధానమైన తేడా. ప్రజల జీవనం నుండి దూరంగా ఉండే కళలో రూపం సంక్లిష్టంగా ఉండి 'సారం' అస్పష్టంగా ఉంటుంది. యక్షగాన కళారూపంలో పాత్రను ప్రవేశపెట్టే పద్ధతి, పాత్ర తనకు తాను పరిచయం చేసుకునే తీరు, రెండు పాత్రల మధ్య సంభాషణ, కథ సాగే పద్ధతి-చాలా సరళంగా ఉంటాయి. ఈ రచనలో ఆనాటి తెలంగాణా భూస్వామ్య సంస్కృతి, వాళ్ల ఆగడాలు, ఆ ఆగడాలకు రాజ్యయంత్రాంగపు మద్దతు చాలా స్పష్టంగా చిత్రీక

రింపబడ్డాయి. ముఖ్యంగా అమీన్ పాత్ర, ఆ పాత్ర పాటలో పలికిన భాష, భావం చాలా ఔచిత్యంగా, బలంగా చిత్రీకరింపబడినవి. దీనికి తోడుగా సామాన్య కుటుంబ సంబంధాలు, ఒకరిపట్ల మరొకరి ఫీలింగ్స్, ఆ కుటుంబ చైతన్యంలో నుండి పుట్టుకొచ్చిన నాయకత్వం, నాయకత్వపు నిజాయితీ, పట్టుదల, అంకితభావాలను ఈ రచన బలంగా ప్రెజెంట్ చేయకల్గింది.

ఇలాంటి మంచి రచనలో కొన్ని లోపాలు కూడా దొర్లినట్లు తోస్తుంది. ఒకటి, రచన ఉద్దేశం ప్రజలను చైతన్యవంతులను చేయడమని భావిస్తే, నారిగాడు నాగయ్యను చంపడానికి ఆయన భార్య లచ్చి చనిపోవడానికి సంబంధాన్ని కల్పించడం మూఢనమ్మకాలకు మద్దతు నిచ్చినట్లే నాగయ్య చనిపోతూ నారిగాడిని ఏం అనకూడదనీ చెప్పడం నాటకీయంగా ఉంటుందే కాని వాస్తవంగా ఉండదు. ప్రగతి, హనుమయ్య, లచ్చి, అన్నపూర్ణలను చాలా ఆదర్శవంతమైన పాత్రలుగా మలచడం కూడా వాస్తవాలకు దూరంగా ఉంటుంది.

ఈ రచన హన్మంతుగారు ప్రారంభిస్తే వాళ్ల అబ్బాయి సుద్దాల అశోక్ పూర్తిచేయటం విశేషం. తల్లిదండ్రుల విశ్వాసాలు వాళ్ళు వాళ్లపిల్లల్ని పెంచే విధానంలో ప్రతిఫలిస్తాయనే ఒక సూత్రీకరణ ఉంది. ఆ దృష్టితో చూస్తే హన్మంతు గారి ప్రభావం అశోక్ మీద ఉండబట్టే అశోక్ ఈ రచనను పూర్తిచేయగలిగాడు. అవుతే హన్మంతుగారికి తెలంగాణా పోరాటంతో ప్రత్యక్ష సంబంధముంది, అశోక్‌కు ఆ అవకాశం లేదు. ఈ రచన చేయాలని అనుకున్నప్పటి నుండి తెలంగాణా పోరాట అనుభవాలను సమగ్రంగా తెలుసుకోబట్టే ఈ రచన పూర్తి కాగలిగింది. ఒక తరం మొదలుపెట్టిన కార్యక్రమాన్ని మరో తరం ముందుకు తీసుకెళ్తుందన్న సామాజిక సూత్రాన్ని ఈ తండ్రి కొడుకుల ప్రయత్నంలో సూక్ష్మంగా చూడవచ్చు. ఇలాంటి సామాజిక ప్రయోజన మున్న రచనను ప్రారంభించిన సుద్దాల హన్మంతుగారికి నా జోహార్లు దీనిని గొప్పగా పూర్తిచేసిన సుద్దాల అశోక్‌ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను

—జి హరగోపాల్

# ధన్యవాదాలు

1987 ఆగస్టులో ఓ సాయంకాలం మామేడిపల్లి (పడమర)లో శ్రీ చంద్రప్రకాశ్ రెడ్డిగారి ఇంట్లో కూచుని నా కొత్త పాట వినిపిస్తున్నాను. అక్కడ వారి సోదరుడు డా॥ విజయభాస్కర్ రెడ్డిగారు వున్నారు.

పాట విని.... .... ....,

"ఎన్నాళ్లిలా నీ పాటల్ని మాకు మాత్రమే వినిపించడం వీటిని పుస్తకంగా వేయిస్తే...." అన్నారు శ్రీ చంద్రప్రకాశ్ రెడ్డిగారు.

"ఎలా వేద్దామంటారు" అన్నాను.

నా అసహాయత ముఖంలో కనపడిందేమో మరి

"నీకెందుకు నీ పాటలు విని ఆనందించే వాళ్లేకాదు, నీకు ఆర్థిక సహకారం అందించేవాళ్ల కూడా వున్నారిక్కడ" అన్నారు.

ప్రక్కనే వున్న డాక్టర్‌గారు అన్నగారి అభిప్రాయాన్ని ఏకీభవిస్తూ హృదయం వెలిగించే తన చిరునవ్వుతో వెన్నుతట్టారు. అంతేనా ఇవ్వడమేకాని చేయిసాచని వారు నాకోసం తమ సమయాన్ని వెచ్చించారు.

అంతే ఆత్మీయులు శ్రీ శ్రీగద్దె లక్ష్మీనారాయణ, శ్రీ గడ్డం లక్ష్మారెడ్డి సర్పంచ్ (మేడిపల్లి), శ్రీ గడ్డం రాజిరెడ్డి, శ్రీ ఏనుగు లక్ష్మారెడ్డిగారలు అండగా నిలబడ్డారు.

చందా యజ్ఞం మొదలైంది........

డా॥ రామచంద్రారెడ్డి (సంఘం నర్సింగ్ హోం) గారు, శ్రీ ముక్క లక్ష్మీకాంతయ్యగారు, అత్యధిక మొత్తం అందించిన మా మేడిపల్లి (ప.) కాపు సంఘం సోదరులు మెట్టుపల్లి 'లాయర్స్ బార్' నా పాటంటే గుండెకు హత్తుకునే న్యాయవేత్తలు శ్రీ దామోదర్‌రావు, శ్రీ వెంకటరామరెడ్డిగారలు తమ సహకార హస్తాలందించారు.

ఖాజీ సమితి ప్రెసిడెంట్ శ్రీ మిరియాల కిషన్‌రావు, కోరుట్ల మండలాధ్యక్షులు శ్రీ సి. నారాయణరెడ్డి మరియు సర్‌పంచ్ శ్రీ రషీంపాషా, బీడీ కార్మిక నాయకులు శ్రీ సి. ప్రభాకర్‌గార్లకు.

మెటుపల్లిలో శ్రీ పడిగెల నాగభూషణం, శ్రీ మోటూరి బాలకిషన్, శ్రీ గజవాడ గంగాధర్ గోధూరులో శ్రీ కె. వెంకటస్వామి, శ్రీ సి. హెచ్. చంద్రయ్య, సినీనటులు గోధూరు మురళి మా ఆత్మీయులైన సహోపాధ్యాయులు శ్రీవి. శ్రీహరి, శ్రీవి. నర్సయ్య, సత్యక్కపల్లిలో శ్రీవిఠల్, మెటుపల్లి D E. E. శ్రీ యాదయ్య, మట్టెల గంగాధర్, మిత్రులు మెటుపల్లి సింగిల్‌విండో అధ్యక్షులు శ్రీ బర్ల సాయన్న, యూసఫ్‌నగర్ సర్‌పంచ్ శ్రీ తుకారాం, సిరిపురంలో శ్రీ రాజారెడ్డి, కరీంనగర్‌లో మా సోదరి పద్మజ, మా బాయ్యా విద్యాసాగర్‌జీ, సుద్దాల సాహితీ మిత్రమండలి, నా బాల్యమిత్రుడు ముజాహెద్ (హైద్రాబాద్) గారలకు తమ చేతులతో నా రచనలు వెలిగిస్తున్న దాతలకు, తమ సాహితీ హృదయంతో తమవాడిగా భావిస్తున్న శ్రీ ఎ. మహిపాల్‌రెడ్డి (శాసన సభ్యులు), డా॥ అందె వేంకటరాజం, ఆదినుండి తోడై, నీడై నిలిచిన ఆత్మీయులు శ్రీ శ్రీగాదె శంకర కవి గారలకు ఆనందబాష్పాలతో చేతులెత్తి నిలిచిపోతున్నాను.

తమ అభిప్రాయాలతో నన్ను అభినందిస్తున్న పూజ్యులు శ్రీ రావి నారాయణరెడ్డి, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ జి. హరగోపాల్, డా॥ జయధీర్ తిరుమలరావు గారలకు, ఈ యక్షగానము విని మనసులో మథించుకొని ముఖచిత్రం గీసి ఇచ్చిన మిత్రుడు మోహన్‌గారికి నా కృతజ్ఞతాంజలులు.

ప్రేమతో కోరుకున్న రీతిలో ముద్రించిన శ్రీ లక్ష్మీవేంకటేశ్వర పవర్ ప్రెస్ మేనేజర్ శ్రీ పి. శ్రీనివాసులుగారికి, ముఖ్యంగా ఎ. ప్రభాకర్‌గారికి నా అభినందనలు.

ప్రచురణాకాలంలో విశ్రమించని శ్రమలో నాతోపాటు పాలు పంచుకున్న మా 'చిన్న' తమ్ముడు సుధాకర్, మరియు శ్రీమతి మౌనలకు నా శుభాశీస్సులు.

—సుద్దాల అశోక్

# యక్షగాన రచన పూర్వాపరాలు

నేను తొమ్మిది నెలలవానిగా వున్నపుడు మా నాన్న ప్రజాకవి సుద్దాల హన్మంతు, మహాకవి సుంకర సత్యనారాయణగారి 'కష్టజీవి' బుర్రకథ ఇతి వృత్తాన్ని అనుసరిస్తూ ఈ యక్షగానాన్ని ఆరంభించారట. కొన్ని గేయాలు అవి రామిరెడ్డి, అన్నపూర్ణ, స్వామిరావు, శీతయ్య పాత్రల ప్రవేశములు, "తెలుపుడీ నను పిలిచిన", "పొడిచి చంపలేను" అను సంవాదములు మాత్రం వ్రాసి ఎందుకో ఆపివేశారు.

నాన్నగారు పోయాక శ్రీ శ్రీగాదె శంకరకవిగారి ప్రేరణతో ఈ యక్ష గానం పూరించాను. నల్లగొండ, కరీంనగర్‌లోని శతాధిక యక్షగానాలు చదివి కొన్ని పాడించుకుని. ఆడించుకుని (క్షమించండి ఆ నాపతు ఫోటోలు ఏవీ తీయించుకోలేదు) ఈ రచన చేయగలిగాను.

ముఖ్యంగా దశాబ్దాలుగా యక్షగానకళలో అనుభవం పండిన నటగాయ కులు మా మేనమామ శ్రీ పాశికంటి సత్యనారాయణ (ఆలేరు), మా మేడిపల్లి (ప) లో జీవితకాలం అంతా యక్షగానాలలో మంత్రివేషంతో తలపండి 'మంత్రి తాత'గా ప్రాంతీయ జనులతో పిలిపించుకుంటున్న శ్రీ భాగవతుల నర్సిములు గారలకు ఋణపడిపోతున్నాను. ఇంకా మా వూరి ప్రజానాట్య మండలి కళాకారులు శ్రీ గనగాని ఆయిలన్న, శ్రీ కాశ యాదగిరి, శ్రీ గడ్డమీది నర్సయ్య, శ్రీ వడ్ల చంద్రయ్య, ముఖ్యంగా మా తమ్ముడు ప్రభు వీరంతా పట్టుబట్టి ఈ యక్షగానాన్ని వ్రాయించారు అచ్చుకన్నా ముందే ప్రదర్శించారు.

ప్రధానంగా ఈ రచన పూర్తిగా వ్యవహారికం. ఇంకా చెప్పాలంటే నల్ల గొండ మాండలికంలోనే చేశాను. ఈ రచనలో కనిపించే గడ్డం అమీను, రాధ పాత్రలు నేను కల్పించినవి. మూల రచనలో లేనివి. (నాన్న కల్పించిన కరణం శీతయ్య మొదలైనవి కాక)

రామిరెడ్డి పాత్రను ఆనాటి దొరలకు ప్రతీకగానూ, ముఖ్యంగా గడ్డం 'అమీను'గా ఆ కాలంలో మోత్కూర్ ప్రాంతంలో పరమ కిరాతకుడుగా ప్రసిద్ధి కెక్కినవాణ్ణి యధాతథంగా అదే పేరుతో ఇందులో చిత్రించాను. అలాగే రాధ పాత్ర కూడా.

ఆనాటి వాతావరణం రచనలో రావడానికి ఎందరో నాటి పోరాట నాయకులు, మా అమ్మ సహకరించారు.

## ప్రదర్శనాభిలాషులకు సూచిక

ఇంత పెద్ద యక్షగానం ప్రదర్శించడం కష్టం. నాకు తెలిపితే ఈ యక్షగానాన్ని కేవలం గంటన్నరలో వేసే వీలుగా సలహా ఇవ్వగలను. ఎందుకంటే మా సుద్దాల గ్రామ ప్రజానాట్య మండలివారు సంక్షిప్తం చేసిన 'వీరతెలంగాణ' యక్షగానం ప్రదర్శించి ప్రశంసలు పొందినారు గనుక.

—సుద్దాల అశోక్

# వీర తెలంగాణ

## సాంఘిక యక్షగానం

పాత్రములు

| | | |
|---|---|---|
| 1. | సూత్రధారి | |
| 2. | హనుమయ్య | వృద్ధుడైన రైతు |
| 3. | అన్నపూర్ణ | హనుమయ్య భార్య |
| 4. | నాగయ్య | కథానాయకుడు |
| 5. | భీమయ్య | నాగయ్య తమ్ముడు |
| 6. | కృష్ణయ్య | నాగయ్య రెండవ తమ్ముడు |
| 7. | ప్రగతి | నాగయ్యచెల్లె-కథానాయకురాలు |
| 8. | రామిరెడ్డి | రామాపురం జమీందరు |
| 9. | స్వామిరావు | కరణం |
| 10. | శీతయ్య | శేత్‌సింది |
| 11. | నారిగాడు | తాగుబోతు |
| 12. | లచ్చి | నారిగాని భార్య |
| 13. | గడ్డం అమీన్ | అమీన్‌సాబు |
| 14. | రాధ | అనాథ యువతి |

ఇంకా రైతులు మొదలగువారు

## సూత్రధారి ప్రవేశం - పాట

శ్రీలక్ష్మి నిన్నెపుడు
సేవించువారము - భరతమాత
పాలించవే మమ్ము
భవితవ్య మొసగుచు - భరతమాత

పొంగారు నదులతో
శృంగారముగ తనరు - భరతమాత
ఎనలేని దానివిగ
వెలుగొందె నావమ్మ - భరతమాత

పసిడిరాసుల నిచ్చు
పంట భూములు గల్గి - భరతమాత
అసమాన కళలతో
యశము గాంచితివమ్మ - భరతమాత

వీరధీరోత్తమ
వారీనడుల గన్న - భరతమాత
నెనరుతో సుద్దాల
హనుమంతును బ్రోచే - భరతమాత

ప్రేక్షక మహాశయులారా! ఇప్పుడు మీరు 'వీరతెలంగాణ' అనే సాంఘిక యక్ష గానాన్ని తిలకించబోతున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది.... అదిగో ఎవరో మాతృమూర్తి వస్తున్నట్టుంది....

## తెరలో ఉన్న అన్నపూర్ణ పరిచయం
### పాట - సూత్రధారి

రైతు వనిత వచ్చెను - తెరలోపలికి
రైతు వనిత వచ్చెను
అతులిత సౌందర్యవతి సత్త్వగుణశీల
హితగాత్రి సుచరిత్రి ఇందీవరనేత్రి ॥రైతు॥

తలకంటి స్నానమాడి - మేన పసుపు
కలయ బూసియు స్వదేశి
తలుపవలుపను గట్టి జరి రవికయును తొడిగి
అలరారు ఇల్లాలు ఆదర్శమున వేగ ॥రైతు॥

కురులు సన్నగ దువ్వియు - విరిసినమల్లె
సరులు కొప్పున జుట్టియు
గరిత కుంకుమబొట్టు కనుల కాటుకబెట్టి
పరిమళగంధము మెరిసే చెక్కిలిబూసి ॥రైతు॥

ఇమ్మహీతలమందున - కొమ్మలంత
సమ్మతి మది నెంచిన
అమ్మా! యెన్నటికైన అరిగి తరుగని తెల్గు
సొమ్ములు ధరియించి శోభిల్లుచు నెంతో॥రైతు॥

అత్తమామల సేవయే - చేతుల పసిడి
అందెలు అనిపించగా
చిత్తమందున విభుని చింతానురాగమ్మె
పుత్తడి ఓడ్యాణముగ దాల్చి పువుబోడి ॥రైతు॥

అమ్మా! అన్నపూర్ణమ్మా! సంతోషం తల్లీ! మీరు తొందరగా తెరవెడలి రావాలని మా అందరి కోరిక.

## అన్నపూర్ణ ప్రవేశం - పాట

చెలియ! తెర వెడలి వత్తునమ్మా!
నా వార్తలెల్ల
తెలియ చెప్పెద వినరమ్మా!
లలన! సకల ప్రాణులకు నిలయమై
వెలుగుతున్న భూమాతకు మ్రొక్కుచు ॥చెలియ॥

కోమలాంగిరో! వినవమ్మా
అన్నదాత రైతు
నామనేనంచు తెలియరమ్మా
నామము తెలిపెద అన్నపూర్ణ నా
ధామము వినగదె రామాపురము ॥కోమ॥

దీనజనుల పాలిటిదైవం
నా ప్రాణేశ్వరుడు
హనుమయ్య అనునదతని నామం
మానసీయుడు యథార్థవాది
జ్ఞానధనుడు సఖి! నా మనోహరుడు ॥దీన॥

తనయులు నాకు మువ్వురమ్మా!
ఒక తనయ, వారి
తగిన పేర్లను తెలిపెదనమ్మా
అనఘులు నాగయ భీమకృష్ణులు
తనయపేరు ప్రగతి యని యందురు ॥తన॥

దేశభక్తుండు సామ్యవాది
కార్మిక రాజ్యాభి
లాషి సామ్రాజ్యవిరోధి
విశారదుడు జననాయకుండు మరి
విశాల హృదయుడు మా నాగయ్య ॥దేశ॥

ఇంకా తేటతెల్లంగ మావూరు సంగతులు చెప్పుతాను వినండి.

సూత్రధారి

తప్పకుండా వింటామమ్మా!

## అన్నపూర్ణ - మంజరి

బాగైన దక్షిణభారతావనిని
రామాపురమ్మనే గ్రామమ్ము కలదు
రామిరెడ్డనెడి భూస్వామికీ వూరు
ఇరవు మాకైనది యీ వూరె సుమ్మ
ఇట్టి వూళ్ళతని కింకెన్నియో కలవు
వాటి కన్నింటికి వారసత్వముగ
జాగీరుదారుడై జనుల పీడించు
రామిరెడ్డని యంటె రగులు గ్రామాలు
ఆతడు చేయని అవినీతి పనులు
అవని నింకెవను లేవని చెప్పవచ్చు
అతని పాలనలోన అల్లాడు ప్రజల
ఏడ్పులార్పులు చెప్ప నెవ్వారితరము
భర్త చేనుల నుంచి వచ్చువేళాయె
పోయి వచ్చెద నింక పుణ్యాత్ములార!

(నిష్క్రమిస్తుంది)

## తెరలో ఉన్న హనుమయ్య పరిచయం

### పాట - సూత్రధారి

శాంతిపూర్ణుడు వచ్చెను
 తాపసులను మించే
కాంతిపురుషుండు వచ్చెను
పరనిందెరుగని పరమపావనుడు
పురజనులందరు గౌరవించగను ||శాంతి||

నాగన్న కన్నతండ్రిగాను
పేరూ ప్రతిష్ఠలు
బాగ వచ్చేనవి మురియుచును
ప్రగతమ్మే తన ప్రాణమ్మనుచును
కొడుకుల చూసే కడుపు నింపుకొను ॥శాంతి॥

పాడు కాలమ్ము పోవాలంటూ
మన సంఘం కోరే
పేదలకు రాజ్యం రావాలంటూ
కన్నీరొలికే అన్నార్తులకై
పోరాడే ధీరుల దీవించగ ॥శాంతి॥

సూత్రధారి

అయ్యా ! తమరి రాకడ మాకు ఎంతో శ్రేయస్సుగా భావిస్తున్నాం ... వేంచేస్తున్న తమ వివరాలు తెలుసుకోవాలని ఆశిస్తున్నాం.

హనుమయ్య ప్రవేశం - పాట

హనుమయ్య యని నాదు నామము - నేను
తలచెద నందరి క్షేమము
భూమిని నమ్మిన రైతుబిడ్డను నేను
భూమాతనే కన్నతల్లిగ కొలుతును ॥హను॥

కులసతి పేరన్నపూర్ణమ్మ - పేద
సాదలందరికిని ప్రేమమ్మ
అనుదినము ననుగాచె అర్ధాంగి వినరయ్య
కనుపాపగా చూచె కారుణ్యగుణధన్య ॥హను॥

ఇద్దరన్నల వెనుక పుట్టిన - ప్రగతి
ముద్దులకూతురు ఒక్కతి
చేతికందిన సుతులు నాగయ్య భీమయ్య
చదువులు నేర్పేటి చిన్నోడు కృష్ణయ్య ॥హను॥

మునిగిన తేలిన తప్పదు - శిస్తు
మునిగిపోనూ జనులకెప్పుడు
కాదన్న లేదన్న కాసంత అగన్న
వేధించి వేటాడు కంసుడై దొరగాడు ॥హను॥

మంజరి

రామాపురము మాది మేము కాపులము
ఏమి చెప్పుదునేను రామిరెడ్డొకడె

అరువదూర్లకు పెద్ద దొరనంటు వాడు
పరమ పాపాత్ముడై పురము లేలంగ

నడుము గట్టెను నాదు కొడుకు నాగయ్య
చాతుర్యమున ప్రజాసంఘాలు పెట్టి

జనమెల్ల సంఘాన జై కొట్టి పిలిచె
హనుమంతు పాటలు అనుదినమ్మింట

పాడుచుందురు పేదబ్రతుకులు దిద్ద
పాడుచుందురు దీనహృదయాల మధ్య

సూత్రధారి

అవునూ! ఆ నాగయ్యను చూడాలని చాలా కోరికగా వుందయ్యా!

హనుమయ్య

ఎందుకంత తొందర నీకు? అదిగో! వస్తున్నారు ముగ్గురన్నదమ్ములు

తెరలో ఉన్న నాగయ్య, భీమయ్య, కృష్ణయ్యల పరిచయం

పాట - సూత్రధారి

తెరలోకి వేంచేసిరి - నిరుపేదల
చెరలన్ని ఖండించిరి
ఊరూర హనుమయ్య - పేరెంతో పెంపొంద
అరువదూరులయందు- అరుదైన సోదరులు॥తెర॥

పెదయైన నాగయ్యను - పెద్ద చిన్న
హృదయాలు దీవించును
మనము పీనుగలోలె - మనరాదు అనుచును
బానిసల బంధాలు - పూని తెంచేసేటి ॥పెద॥

నాగయ్యతో సంఘము - గ్రామమ్మున
సాగింది అనువిరతము
నిరుపేద జనమెల్ల - కరములు కలుపంగ
సుద్దాల హనుమంతు - సుద్దులు పలుకంగ॥నాగ॥

నాగయ్య

సూత్రధారీ! అంతా క్షేమమే కదా!

సూత్రధారి

అంతా క్షేమమే. తమకోసమే అందరం ఎదురుచూస్తున్నాం.

నాగయ్య

అట్లనా. అయితే వస్తున్నాం.

నాగయ్య, భీమయ్య, కృష్ణయ్యల ప్రవేశం - పాట

అన్నదమ్ములు ముగ్గురు
హనుమయ్య సుతులు
ఎన్నదగియున్న శూరులు
గుండె కండ బలముండి ప్రజలకు
అండదండగ నుండే ధీరులు ॥అన్న॥

నాగయ్య

పేదవర్గాల మిత్రుడ
నాగయ్యందురు నను
పెద్ద దొరలకు శత్రుడ

బీదవారి హింసించు దేశముఖ్
బాధలు పోవగ బోధ చేయుదును ॥సేవ॥

భీమయ్య

అన్న ఆజ్ఞలో నిలిచెద
వ్యవసాయములోని
అన్ని పనులందు భీముడ
చెడబలిసిన దేవుడి పోతులతో
గడియలోన బీకుల దున్నించెద ॥అన్న॥

కృష్ణయ్య

బియ్యే విద్యార్థి యువకుడ
కృష్ణయ్యను నేను
న్యాయం ముందరనే తలవంచెద
జాగిర్దారుల పోషించే నై
జాము విధానము ఖండించెదను ॥బియ్యే॥

నాగయ్య

రాత్రి విద్యాలయమును స్థాపించి
అధ్యాపకుండనై
రైతులందరికి చదువు నేర్పి
దొంగలెక్కల కరణము కోమటి
దొంగల లంగల లొంగదీయుటకు ॥రాత్రి॥

భీమయ్య

శ్రమలన్ దోచేటి దొంగలాను
చేపబుగా తలచి
ప్రజలన్ పొడిచేటి కొంగలాను
సంఘబలము సిద్ధంగజేసి ఒ
ళ్లంగ దొరోడిని ఖంగమొనర్తుము ॥శ్రమ॥

కృష్ణయ్య

సాటి గ్రామస్థులకు ఆదర్శం
మా సోదర ప్రేమ
నేటి కలికాలానికి అపురూపం
ఆత్మ పొంగి సుద్దాం ప్రశాంతి
హనుమదాద్యులే మెచ్చిన బంధము ॥సాటి॥

నాగయ్య

భీమా! పొలాలు బాగున్నాయా? వరి పచ్చబడిందా?

భీమయ్య

పచ్చగనే అయిందన్నా! మన యెద్దుకే కొంచం గాలి అయి కుంటుతుంది.

నాగయ్య

నాయినకు చెప్పలేదా?

భీమయ్య

ఏదో పసరు పోయించిండు గొల్లోల్ల తాతతోని. అపునూ! క్రిష్ణ పరీక్షలయి నాయా?

కృష్ణయ్య

అవునన్నా రెండో సంవత్సరం అయిపొయ్యే. పెద్దన్నయ్యా! మీ రాత్రి బడి బాగా సాగుతుందా? సంఘాలు అన్ని ఊళ్లల్లో నిల్చినట్లేనా?

నాగయ్య

ఇంకా పూర్తిగా జనంలో తెగింపు రావటం లేదుగా! సరే పద చెల్లి పొలంకాడి నుంచి రావచ్చు.

(నిష్క్రమిస్తారు)

## తెరలో ఉన్న ప్రగతి పరిచయం

### పాట - సూత్రధారి

ప్రగతి వచ్చేను - కరుణా
సుగతి వచ్చేను
వచ్చెనమ్మా! తెర లోపలికి
అచ్చుమా రతనాల కలికి
సిరులు చిలికే చిరునగవులతో
మరులు గొలిపే వయ్యారముతో ॥ప్రగతి॥

మృదుల రాగాలు - పలికే
మధుర వచనాలు
ఊరు పూరు సోదరీయని
కోరి కోరి పలుకగానూ
ఎల్లరి కుశలాలు తలచే
ఎల్లరి యెదలందు నిలిచే ॥ప్రగతి॥

తెల్లవలువలనే - ఎప్పుడూ
తెల్లకలువలనే
చుట్టుకొనుచు స్వాతంత్ర్యముకై
కట్టుకొనెను కంకణమును
పిడికిలెత్తి కొడవలెత్తి
నడవమని హనుమంతు పాడగ ॥ప్రగతి॥

### సూత్రధారి

అమ్మా! మీ తీరు చూస్తే ఇందాక నాగన్న చెప్పిన ప్రగతి మీరేననిపిస్తుంది. తమరేనా నాగన్నచెల్లి?

### ప్రగతి

అవునయ్యా! నా పేరే ప్రగతి.

## సూత్రధారి

సంతోషం తల్లి! త్వరగా వేంచేయండి

## ప్రగతి ప్రవేశం - పాట

శ్రీ సోదరీ! [illegible] కూడదే వి
జ్ఞానహీనగా జాతి - జన్మాంత సం
తాన యాంత్రముగ మారి - వంటింటిలోన
వింత బానిసగ మారి
పొగజారి - సగమారి
దిగజారి - ఓనారి! ॥శ్రీ॥

వినలేదటె [illegible] వెం
డెను [illegible] - శత్రుల దుని
మెను రుద్రమాంబ - మహిషుని మద
మణచె చండికాంబ
వినలేదా? కనలేదా?
మన గాథ - తెలియదా? ॥శ్రీ॥

అతిభీరువై పతిహీనవై జీ
వించే దీనకాంత - అటుచూడు విసు
నూరు రాక్షసునితో - పోరాడె అయి
లమ్మ ధీరవనిత
ఎదురేల - పదవేల
ఈనేల - దొరదేల? ॥శ్రీ॥

మన వూరిలో దొర రాక్షసుండౌన
రించే పిశాచి చేతల్ - ఎన్నేళ్లు గడుపు
దాము వెట్టి బతుకుల్ - వినలేద సు
ద్దాల హన్మంతు పాటల్?
మనముందు - దొరమొందు
రాడందు -పదముందు ॥శ్రీ॥

సూత్రధారి

అమ్మాయీ ! ప్రగతి ! నీ ఆశయాలు, బోధనలు చాలా చక్కగా ఉన్నాయమ్మా

ప్రగతి

అవునయ్యా ! ఈ ఆశయాలనే మా పెద్దన్న నాగయ్య ఉగ్గుపాలతో నేర్పించాడయ్యా. నేటి స్త్రీలంత ఆనాటి వీరవనితలైన రుద్రమ్మను, నాగమ్మను, మొన్న మొన్నటి ఝాన్సి లక్ష్మిబాయిని మరచిపోయారు. దేశ స్వాతంత్ర్యం కోసం, దుర్మార్గులైన దొరల పెత్తనం కూలదోయడం కోసం స్త్రీలు కూడా తమ వంతు కర్తవ్యం నెరవేర్చాలి అందుకే మా నాగన్న సాయంతో మహిళా సంఘాలు ఏర్పాటు చేస్తున్నాను.

సూత్రధారి

సెభాస్ ప్రగతీ ! నీ ఆశయానికి జేజేలు. స్త్రీ కేవలం వంటింటి బానిస అను కునేవారికి నీ పాట గొడ్డలిపెట్టు. మీ పోరాటం సఫలం కావాలని ఆశిస్తా.

ప్రగతి

ధన్యురాలిని. వస్తా మరి. మా అన్నలు, అందరు నాకోసం ఎదురుచూస్తారు.

(నిష్క్రమిస్తుంది)

సూత్రధారి

అదిగో ఎవరో యిటే వస్తున్నారు. వేషం చూస్తే శేత్‌సింది లాగుంది. రానీ తనే తన భాగోతం తెలుపుతాడు కదా !

శేత్‌సింది సరాసరి జనంలోంచి వేదిక మీదికి వస్తాడు

శీతయ్య శేత్‌సింది - పాట

శేతుసిందునూ జాగీర్ దొరల
చేతుకిందివాడను బాంచెన్
సీతడనుచు నను ప్రీతిగ పిలుతురు
తాతలనాటి తాబెదారి యిది ॥శేతు॥

మూడే రూపాల్ నెల ఒక్కింటికి
యూడాదెల్లిన దొరుకది జీతం
మది చూపిరి మాన్యంబని వందని
మదికై అడుగడుగున బెపిరి తురు ॥శేతు॥

కూడుచుండి గుర్రాల మరిపెదరు
దొరలు గుమాస్తలు ఈ దొరసాన్లు
తీరికలేదు పగలు రేయి దొర
గారి యాజ్ఞలను మీరరాదు మరి ॥శేతు॥

వట్టి మాటలకు ప్రజలను మాచే
తిట్టేయింతురు లాలు కానక
కట్టికొట్టి దండుగ జాపింతురు
బుట్టి నోటికి పెట్టి గట్టిగా ॥శేతు॥

సూత్రధారి

అయ్యయ్యో! శితయ్యా! నీ విషయం చాలా బాధగా వుందయ్యా. మరి నీవీ కొల్లువులో ఎందుకు చేరావు ఏంటా కథ చెప్పు.

శీతయ్య

ఏంజెప్పాల బాంచెన్ మా కష్టాలు. ఇనండి లోతుకాన్నుంచి చెప్పుకొస్త.

మంజరి

వినరయ్య మము గూర్చి వివరింతు నిపుడు
ముదిరాజులము మేము పూర్వమ్మునుంచి
సాముచేయుట యందు శౌర్యమ్మునందు
మల్లయుద్ధము నందు ఎల్లరన్ మించ
దేశముఖ్ మరి దేశపాండ్యులు
జాతి విద్రోహులౌ జాగీర్దార్లు

తమ రక్షణకుగాను మము చేరదీసి
ఈటెల బాకుల నెన్నెన్నొ యిచ్చి
బందిపోట్ల విధాన పల్లెల దోచి
ముదిరాజులను పేరు ముంచేసి మమ్ము
బంట్లు బంట్లంచు పిల్వగ సాగినారు
కోటలు బురుజులు కొమరొప్ప గట్టి
పాపాత్ములై మమ్ము కాపలా బెట్టి
కాలమ్ము హాయిగా గడుపుచున్నారు
తరతరాలుగ వారి కాపెదార్లగుచు
చెప్పిన పనులన్ని చేయుంగవలయు
మంచి చెడ్డల విచారించనే లేదు
ధరణిలో మముగాచె దక్షులేరీ.

గొర్ర లేచే యాల్లయింది. తొందరగా పోవాలె పోయి వస్త బాంచెన్.

తెరలో స్వామిరావు

ఎవర్రా తెరముందు?

సూత్రధారి

అయ్యా! నేను సూత్రధారిని

స్వామిరావు

అచ్చా! మేం వస్తున్నామని జనానికి చెప్పావా?

సూత్రధారి

చెప్పానండీ!

స్వామిరావు

ఠీక్ హై

## తెరలో ఉన్న స్వామిరావు పరిచయం

### పాట - సూత్రధారి

పంతులయ్యో వచ్చెను - సర్కా కరణం
పంతులయ్యో వచ్చెను
పంతులయ్యో సకల పాపాల భైరవుడు
పంతులయ్యో ప్రజల పాలిటి యముడనగ ॥పంతు॥

సంతతము జాగిరుదారున
కంతరంగుండగుచు పొగరున
వింతగా అంచేక పేదల
గొంతులెన్నో కోసినట్టి ॥పంతు॥

పంగనామాల్ బెట్టియు - బారాబంది
అంగరాఖా తొడిగియు
రంగారు జలతారు పాగా నెత్తికి జుట్టి
హంగు మీరంగ గోరంచు దోవతి గట్టి
చింగులు ఒకవైపు వ్రేలా
తంగ వంకర మాపుకోటి
సంగనాటి విధంగ బిరబిర
జంగలేయుచు పగటిదొంగై ॥పంతు॥

ఖండితంబుగ పలుకుచు - మామూళ్లకై
దుండగీడుల నంపుచు
దండుగలెన్నో విధంబుల జాడించు
కొండె కాడై జనుల కొంపలార్పుచు నుండు
పండినను ఎండినను పన్నులు
బండలెత్తి వసూలు చేయును
నిండుగా రక్తము లదుగుతె
మండిపోయే ముంజకొడుకు ॥పంతు॥

ఇల నున్న కారడవులు - నరికి సాగు
దలకు తెచ్చిన రైతులు
బలమైన బంగారు పంటలు పండించి
ఫలితము పొందంగ చూడవోర్వగలేక
పలు విధంబుల కుట్రలెన్నో
పన్ని వారల నోళ్ల గొట్టి
కౌలుదారుల జేసి రైతుల
పొలములను దొర కంటగట్టిన ॥పంతు॥

జాతి మతముల నెంచుచు - అన్యుల యెడల
బూతులే కల్పించుచు
సేతువారి చౌసల్ల పహాణి ఇర్సల్‌నామ
బస్త మోయుచు ఒకడు పయనించ హర్కారు
బెత్త మొకటి చేతబట్టి
కొత్త బూట్లను తొడిగి దొరకు
తొత్తుగాడై ప్రజలమీద
కత్తులను తెగ నూరుకుంటు ॥పంతు॥

సూత్రధారి

ఆహా! పటువారిగారూ! మీ జన్మయే జన్మ. రండి త్వరగా స్వామీ!

స్వామిరావు ప్రవేశం - పాట

పటువారిని నాపటిమ తెలియుడీ
జటిలధైర్య సాహసుడనురా
తటపటలాడక ప్రజలను, ప్రభుతను
చిటికెలోన వంచించె ప్రజ్ఞగల ॥పటు॥

వాటముగా దొరగారు చెప్పిన
మాట నెపుడు జవదాటనురా
రాటు పడుదురెవరైన నాదు వా
గ్ధాటికెదురు విల్వలేరురా
ధాటిగా నాకు గణితశాస్త్రమున
సాటి లేరెవరు మేటి కరణమును ॥పటు॥

విన్నావా సూత్రధారీ

సూత్రధారి

ఆఁ విన్నానండీ! అహా! ఎంత గొప్పవారు స్వామీ! దొరలకింద దొరలు మీరు. సరే వెళ్లి రండి

(స్వామిరావు నిష్క్రమిస్తాడు)

సూత్రధారి

చూశారా ప్రజలారా! నైజాం ప్రభుత్వంలోని పటువార్ల ప్రతాపం. ఎంత అంధకారమయం! ఎంత భయంకరం ప్రజాజీవిత వ్యవస్థ! ఇంక ఆ దొరగారి రాకడ గాకపాయె. అదిగో! సీతయ్య వస్తున్నాడు

శీతయ్య

ఇగో! యెవల్లయ్యా? దొరగారొచ్చే ౘైమైంది. అందరు హుష్షారు గుండాల. అగ్గో సప్పుడయితుంది. దొర కచ్చురం గజ్జెల సప్పుడు! గజ్జెల సప్పుడు!

తెరలో రామిరెడ్డి

ఎవల్రా అక్కడ? శేత్‌సింది శీతిగాన్ని పిలువురా!

శీతయ్య

శీతిగాడు హాజర్ ఖాంచెన్. గులాపోన్ని. ఈన్నేవున్న.

రామిరెడ్డి

ఓరే! శీలిగా కరణం సామిరావు దగ్గరికి పోయి జల్ది తోలకరా!

శీతయ్య

అట్లనే బాంచెన్

(నిష్క్రమిస్తాడు)

రామిరెడ్డి

ఎవర్రా అక్కడ?

సూత్రధారి

ఎవరండీ? మీ కంఠం వింటే గంభీరంగా ఉంది. మహాప్రభువుల్లా గున్నారు. ఎవరో సెలవిస్తారా? ఓహో! అర్థమైంది. రామాపురం జమీందారు రామిరెడ్డి గారు కదూ,

తెరలో ఉన్న రామిరెడ్డి పరిచయం

పాట - సూత్రధారి

రామాపుర దొర వచ్చెను - రయమున ప్రీతి
గ్రామమంతట పొంచెను
ధూమధామున మంచి
దుస్తులు ధరియించి
తామసంబున గొప్ప
తనము చూపించుచు ॥రామా॥

చుడీదారు పైజామయూ - సైను సిలకు
సొగసైన షహర్మానియూ
మెరయు కుచ్చుటోపి
శిరమున ధరియించి
కడువేడ్క గొలుపేటి
కండ్లద్దముల తోటి ॥రామా॥

ఎడమ చేతికి గడియారం - కాళ్లకు బూట్లు
జోడు నడువగ వయ్యారం
పొడవైన జరిసెల్లా
మెడ నుంచి జీరాడ
కుడిచేత బెత్తము
జడిపించుచును వేగ ॥రామా॥

వెనుక ముందర హరిజనులన్ - ఉరికించుచు
తాను కచ్చర మెక్కియున్
ఘనమైన జతమూగల్
ఘల్లుఘల్లున మ్రోగ
ధనదర్పమున ఎడ్ల
తరుముచు గెనుముచు ॥రామా॥

ఓరచూపుల మీటుచు - కొనగోటితో
కోరమీసము తీడుచు
దారి పొడుగున ప్రజలు
దండంబు లనుచుండ
రావా పోరా యనుచు
రాజసమ్మున వేగ ॥రామా॥

సిరిమంతుడై గొప్పగా - కప్పంబులు
కరుణ లేకను గుంజును
జనుల పాటలు రానే
హనుమంతు గారిని
జైలుకు పట్టించే
బలమున్న దొరనంచు ॥రామా॥

రామిరెడ్డి

తెలిసింది కదా నా శ్రీవి?

సూత్రధారి

ఓహోహ్హో! మహానుభావులు. మీ తీవికేమయ్యా మహాప్రభువులు. మిమ్మల్ని చూస్తుంటే సాక్షాత్తు విసునూరి రామచంద్రారెడ్డిగారే గుర్తుకు వస్తున్నారు.

రామిరెడ్డి

హ హ్హ హ్హ హ్హ! ఒరే! విసునూరి రామచంద్రారెడ్డి, చెల్లపల్లి రాజ, సంస్థానం లింగాపురం దొరవారు, సూర్యపేట లక్ష్మీకాంతరావు వీళ్లంతా మా దగ్గరి స్నేహితులు.

సూత్రధారి

అట్లాగా మహాప్రభూ! అందుకనే మీకంఠంలోనే ఆ దొరతనం వినబడుతుంది.

రామిరెడ్డి

మరి నా దర్శనమిచ్చి ప్రతాపం చూపించుమంటావా?

రామిరెడ్డి ప్రవేశం - పాట

స్వామిని - ఏలెంటితిని భూ
స్వామిని
స్వామినిరా బహుగ్రామము లందున
భూములు చాలా పొందినవాడను ॥స్వామిని॥

ఆర్యుడ - సనాతనధర్మా
చార్యుడ
ఆర్యుడ నే పరిపాలన ధుర్యుడ
కార్యశూరుడను కలిమి బలిమిగల ॥ఆర్యుడ॥

దాతను- అరువదూర్ల ప్రాణ
దాతను
దాతను నేతను నైజాం రాజును
ప్రీతిగ గొలిచే జాగీర్దారును ॥దాతను॥

మంజరి

ఖాసిల్లు దక్షిణ భారతమందు
రాణించు చున్నట్టి రామాపురమ్ము
వాసమయ్యేను మాదు వంశమ్ము కెల్ల
ఆదిలో మా తాత అతిభయంకరుడు
చదువు శాస్త్రములందు చతురధీయుతుడు
నైజాము పరిపాలనకు తోడుగాగ
మాతాత తిరిగిన మరియాద వలన
ఆర్జించె నర్రాజు నందర్వదూర్లు
జాగీరు స్థిరమాయె చక్కగా మాకు
వారసత్వపు హక్కు వరుసతో దొరికె
అరువది గ్రామాల కధిపతినైతి
ఫసలు శిస్తుకు పది వంతులు పెంచి
కౌలుకు భూమిచ్చి ఘనవస్తు కనక
ధనధాన్య సంపదల్ దండిగా గూర్చి
కడుపు లోపల చల్ల కదల కుండగను
హాయిగా జీవింతు అడ్డు లేకుండ
రామిరెడ్డని నాదు నామమ్ము వినర
రైతుకూలీలకు రాజును కనర.

సూత్రధారి

ఆహాహా ! ఎంత గొప్ప చతురులండి మీరు, మీ తాత. ఇదన్నమాట మీ జాగీరుదార్ల అసలు రహస్యం.

రామిరెడ్డి

మరేమనుకున్నావురా ? ఆయన మా ముత్తాత. ఇక మా తాత బందిపోటు ముఠా నాయకుడై లక్షల సొమ్మును ఆర్జించాడు. మమ్ములను మరెవ్వరు దోపిడీ చేయకుండ పకడ్బందీగా బ్రహ్మాండమైన బురుజు కట్టించాడు.

### సూత్రధారి

ఓహో! అదా దొరా! బురుజుల కట్టడాలకు అసలు కారణం! చాలా బాగుంది! ఇంకా చెప్పండయ్యా! మీ ప్రతిభా ప్రాభవాలు.

### రామిరెడ్డి

ఇంకా చెప్పమంటావా? అచ్ఛా! భేష్!

### పాట

నేనే జాగీర్దారుండరా - రామాపురమందున
నేనే జాగీర్దారుండరా
నేనె దేశముఖ్ నేనె దొరను మరి
నేనె మక్తెదార్ నే భూస్వామిని ॥నేనే॥

దినము పన్నెండు జాతుల - వారలు నాయింట
పనులు వెట్టికి చేయగా
వెనుక ముందు చేసిన ఎదురాడిన
జనుల తోలు వెంటనె ఒలిపించెద ॥నేనే॥

సర్కారు నౌకరుల దిట్టి - నాచేతి కీల్బొ
మ్మలుగా చేసితి చెరబట్టి
కలదు ధనము రౌడీల బలగము
కలదు నాకు పోలీసుల బలము ॥నేనే॥

భట్టు బ్రాహ్మణులు పొగడగా - మేలైన భోగం
జట్టు ముంగిటిలో ఆడగా
పట్టభద్రులు ప్రభుత్వ నేతలు
పడియుండెద రెప్పుడు నాముందు ॥నేనే॥

**దుడుకు సుద్దాల హనుమని - గౌరవించనెపుడు**
**చెడిన కవి వాడు మునుగని**
**కదువడి భూముల కౌలుచట్టమున**
**సుడివడ రైతుల త్రోసినాడను ॥నేనే॥**

## సూత్రధారి

సెహబాస్ ! మీ పరాక్రమధాటి హిమాలయ పర్వతాలదాక వ్యాపించిందనుకోండి. సరే! దొరవారూ ! కూర్చోండి. చెప్పండి. ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్టు న్నారు.

## రామిరెడ్డి

అవునురా ! కరణంగారి కోసం శేత్సింధిగాన్ని పంపిన. ఇంకా రాకపాయెనని....

## శీతయ్య ప్రవేశించి

దండం బాంచెన్ !

## రామిరెడ్డి

ఏడిరా కరణం ?

## శీతయ్య

కచ్చురం దిగిండు దొర ! పెద్దర్వాజలకు రావొచ్చు కాల్మొక్త.

## రామిరెడ్డి

సరే! నీవెళ్లా

## స్వామిరావు ప్రవేశించి

దండం దొరవారు !

## కందం

**దండము జాగీర్దారుడ !**
**దండము భూస్వామిలోక ధనపతిరూపా !**

దండము నను బిలిపించిన
మెండగు పనియేదో తెల్పు మెప్పుగజేతున్

అయ్యా! కరణం బ్రతుకు దొరకే అంకితం గదా! చెప్పండి ప్రభూ! మీరు అరిజెంటుగ రమన్నరని శీతిగాడు చెప్పినపుడు ప్రక్క వూళ్లో ఉన్న అందుకే కొంత ఆలస్యమయింది. అయినా....

సంవాదం - పాట

తరుముకొని వస్తిని - కచ్చేరమును
దొరలు పిలిపించారని
బరువైన పని యేదో
జరిపించగా నెంచి
కరుణించి కరణమును
త్వరగా పిలిచెదరంటూ ॥తరు॥

అయ్యా! ఎంతో ముఖ్య విషయంగా అనుకొనే తిని మూతి తుడ్చుకుంటనే వచ్చిన

రామిరెడ్డి

శెభాష్ కరణం! ఏంలేదు సర్కారు ఒక ఫర్మానా పంపిందయ్యా

స్వామిరావు

ఫర్మాననా? ఏమనో?

రామిరెడ్డి

చెటుతా

ఇంగిలీషువానితో - జర్మనువాడు
జంగు చేస్తున్నాడుగా
ఖరునొచ్చి సరుకారు
ఫరమాన పంపింది
లేవి యివ్వాలంటు
ఇవ్వాల చాటింపు ॥ఇంగి॥

స్వామిరావు

అసలుకే లేదంటే పెసర్పప్పు కావాలన్నట్టుంది. మన భూమిశిస్తు వసూలుకే ఈసారి తిప్పలంటె తిప్పలైతుంది.

రామిరెడ్డి

తిప్పలా? మేలుకుండే మాట్లాడుతున్నావా?

స్వామిరావు

ఇగో గిచ్చుకుంటున్న నొస్తుంది.

రామిరెడ్డి

హాస్యం చాలు. ఏం తిప్పలు?

స్వామిరావు

నాగడు అనువాపితో - తలనొప్పిచే
అగమై పోతుంటిని
ఉన్న పన్నులె వాడు
ఊడ గొడుతున్నాడు
లేవి గల్లను గూడ
ఏ రీతి గుంజెదము ॥నాగ॥

రామిరెడ్డి

హాఁ హాఁ హాఁ పండ్లా?

స్వామిరావు

మూతిపండ్లు కాదు భూమి పన్నులు

రామిరెడ్డి

నాగడు! ఆఁ! హనుమని కొడుకు పోరడు! ఆ చోటా బచ్చాగాడు!

నిన్న మొన్నటి పోరడు - నాగడు నేడు
నన్ను గానకున్నడు
మన్ను గరిపించాలి
వున్న జనులందరిని
పన్నులతో వేపీని
తన్ని జాడించాలి ॥నిన్న॥

సమజయిందా ? పంతులూ !

స్వామిరావు

దొరవారు !

పోరడనుకుంటిరా - నాగడు చేసే
నేరములు వింటిరా
దొరలెక్క లేదంచు
ఊరూర మొరుగును
మన వెట్టి బంజేయు
మని చెప్తున్నాడు ॥పోర॥

రామిరెడ్డి

ఆఁ. ఎంత పొగరు !

దొడ్డు బలిశావని - పిల్లను నేడు
గుడ్డొచ్చి బెదిరించునా ?
గడ్డి పోచే వాడు
గుడ్డి గవ్వకు లేడు
వాని సంగతి వదలి
కానివ్వు పని మొదలు ॥దొడ్డు॥

గుడ్డి కన్ను మూస్తే ఎంత? తెరుస్తే ఎంతగాని మీరు వసూలు మొదలుపెట్టండి.

(నిష్క్రమిస్తారు)

### నాగి ... డ్డి

### ... పూర్ణ

నాగీ! వంటైందిరా! అన్నానికి రండమ్మా. అప్పుడే తొమ్మిది గంటలు కొడుతున్నట్టుంది. చిన్నా! టైమెంతైందిరా?

### కృష్ణయ్య

పావుదక్కువ తొమ్మిదమ్మా!

### అన్నపూర్ణ

అమ్మో! బాగానే అయింది. మీ నాయినదో తిక్క. తినమంటే అందరితోని తింటనంటడు. కొడుకులను, బిడ్డను సంగ్గా పెట్టుకుంటాడో? మరేందో?

### హనుమయ్య

హేం పిచ్చిదానా! నేను అట్లేందు కనుకుంటనే, అందరితోని తింటే అదో తృప్తి నీకూ ఒక్కసారే పనితీర్తది కదా!

### అన్నపూర్ణ

ఇంతన్నా ఒక్కడన్నా కదులుతుండా? అన్నాచెల్లెలు ఆలోచనలకిక అంతేలేదు. చిన్నోనికి రాస్కునుడంటే బంగారం, పాఠం బువ్వే. భీమన్న చేసి చేసి వచ్చే కొడుకు. వానికి ఆకలైతుందో ఏమో!

### భీమయ్య

ఏం కావటం లేదమ్మా! అన్నచెల్లెండ్ల పని అయిపోసి తిందాంగానీ

### అన్నపూర్ణ

కన్నా! నాగీ! రా కొడుకా! ఇయ్యాల అసలు ఒక్కసారి కూడా తినకపోతివి కదరా!

సంవాదం - పాట

కన్నా! తీరని పను లాపెయ్‌రా - నా తండ్రి నాగి!
అన్నం దిని వెల్దువుగానీ రారా
దున్ని దున్ని శ్రమన్ని వచ్చె మీ
నాన్న వచ్చె తొమ్మిది గావచ్చె
చిన్నవాని ఆ రాత తీరది
అన్న చెల్లెలి యోచన తేలది ॥కన్నా॥

అన్నం సహియించదేమిర నీకు - నాగన్న! నిన్ను
ఎన్నిసార్లు పిలువాలి నేను
పొద్దున నువు చాబొట్టు తాగవు
చద్ది తినవు నా సుద్దిని వినవు
మధ్యాహ్నం కూడా తినవైతివి
పొద్దుగూకె నిద్రించె గ్రామము ॥అన్నం॥

పిల్లలందరు ఇంట్లో ఉంటే - మీనాన్న ఒంటిగ
ఒల్లనంటాడుర తినమంటె
అందరు కలిసిన సందడిలో ఆ
నందంగా భోంచేయా లంటె
పొంగి పోవు మీ నాన్న మనసనే
సంగతి నీకూ తెలియును గదరా ॥పిల్ల॥

నాగి! రాండయ్యా. రాత్రి బడికొచ్చేటోల్లు వస్తరు. జల్ది తింటే వాల్లకు సదువు చెప్పి ఎప్పుడన్న పండుకోవచ్చు.

నాగయ్య

అమ్మా! వచ్చేస్తున్న వడ్డించు - నాదీ పొరపాటే
నమ్మా! ఆలస్యానికి మన్నించు
అన్నార్తుల కన్నీటి బ్రతుకులిం

కెన్నాళ్లో యని తలచిన కొలది
ఉన్న ఆకలి కరవై తున్నది
కన్నులలో కునుకే రాకున్నది ॥అమ్మా॥

ఆలస్యం చేయాలని కాదమ్మా! అసలీ బీదల కష్టాలు ఎప్పుడు విముక్తి అవుతాయా? అనే ఆలోచనేనమ్మా - రేపు ఐదారూర్ల ప్రగతి నేను తిరిగేదుంది. ఆ విషయమే మాట్లాడుతున్నాం.

హనుమయ్య

అయితే నానా! మరి వీళ్లంతా ఏకమైతారంటావా? లేక నీ కష్టం బూడిదలో బోసిన పన్నీరేనా?

నానా! ఫలియించేనా నీ త్యాగం - నిరుపేదలందు కలి
గేనా ఒక బాటను నడచే యోగం?
గులాపోన్ని నీ బాంచెనైత నీ
కాళ్లమొక్త అని లొంగే జనులు
బలహీనులు కదలే పీనుగలు
బలవంతుల చేత్తుల గాన్గులు ॥నానా॥

ప్రగతి

నాన్నా! తప్పక మా ప్రయత్నానికి ఫలితం ఉంటుంది. జనులెంత బలహీనులైనా వాళ్లను ఒక్కటిగా చేస్తే చాలు! "అనాథలంతా అశాంతులంతా దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో విప్లవశంఖం వినిపిస్తారోయ్." అని శ్రీశ్రీ అన్నట్లే జరుగుతుంది. ఇంతెందుకూ?

చీమల్ చూస్తేను చిన్నవి కదనే - కాటేసే నాగు
పామున్ నిమిషంలో చంపును గదనే
రావలె ఒక్కటె చైతన్యము మరి
పోవలె ఒకటే పిరికితనమ్మా
అన్నా నేను చేసే పని యదె
ఎన్నటికైనా విజయం మనదే ॥చీమల్॥

భీమన్న

సరేనమ్మా ! కాని ఒక చిన్న అనుమానం. 'జయం మనదే జయం మనదే' అని అంటున్నావుగానీ ...

చెల్లీ! నీ జోస్యం ఫలియిస్తుందా - ఈ ప్రపంచమ్ములో
తల్లీ! నువు చెప్పినట్లు జరిగిందా ?
చీమలవలె జను లేకమయిరా ?
పాము వంటి దొరలంతమయ్యిరా ?
రాజులు కుక్కల చావు జచ్చిరా ?
ప్రజలే ప్రజలను పాలించారా ? ॥చెల్లీ॥

ప్రగతి

ఓహో! మంచి సందేహమే యిది

అన్నా ! వినవే ఒక వాక్యమ్ము - ఉదాహరణకు
ఉన్నాది రష్యా అను దేశమ్ము
క్రూరులైన జారుల పరిపాలన
దూరము చేసిన పోరుటలందరు
సమసమాజమును స్థాపించారు
సమాన హక్కులు సాధించారు ॥అన్నా॥

నాగయ్య

ఏది యేమైనా కోడిగుడ్డులో పిల్ల యెంత కాలముంటుంది భీమన్నా. సమయం రాగానే పగులగొట్టుకొని వస్తుంది. పాత సంఘం రాలిపోయేది ఖాయం. ఒక సంఘర్షణలోంచి కొత్త వ్యవస్థ తప్పక పుడుతుంది. మనకు స్వాతంత్ర్యం వస్తుంది.

ఏది ఏమైనా ఒకటే సత్యం - ఎందరు బలియైన
పేద వర్గాల గెలుపే తథ్యం

ఉభయవర్గ సంఘర్షణలో ఉద
యించ గలదు ఒక నవీన శకము
చరిత్ర గతి యిదె చాటుతున్నది
గరీబోళ్ల గతి మారనున్నది ॥ఏది॥

అన్నపూర్ణ

అబ్బ ! అందరు ఒక్కాకుల్నే సదువుకున్నర్రా మీరు

అందరందారు ఒక్కచేరా - నే మొత్తుకున్న
తొందరే మాత్రం లేమ లేరా
సూద్దమంటె ఒకసారి దేశవి
సుద్ది యెవ్వడు తియ్యడుగాని
రాజకీయములె అన్నం మీకు
భోజనాలు కల్లార వచ్చెం ॥అంద॥

రైతులు ప్రవేశిస్తారు

రైతు

దండాలు నాగన్నా !

నాగయ్య

నమస్తే ! నమస్తే ! కూర్చోండి.

అన్నపూర్ణ

నే నప్పటి నుంచి అంటనే వున్న సరే ! మీరు చాపలమీద కూచోండి. నాగన్న తిని వస్తడు గని

రైతు

సరె సరె ! ఇంతల మేం నిన్నటియి రాసుకుంటం

(నాగయ్య కుటుంబంతో నిష్క్రమిస్తాడు)

నాగయ్య, ప్రగతి ప్రవేశిస్తారు

ఆఁ ప్రాశారా !

రైతు

రాసినమండి ! ఏఁదో ముసలితనానికి కుసుమగుడా అన్నట్టు సదువు రాకుం ఛేంది నాగన్నా ?

నాగయ్య

అక్షరాలు నేర్చుకోవటం, అచ్చు పుస్తకం చదవటమే చదువుకాదు. చదువు అంటే సంస్కారం, తెలివి, విజ్ఞానం పెంచుకోవటం. అప్పుడు దేశమంతా స్వాతంత్రం లేక ఎంత తల్లడిల్లుతుందో తెలుస్తుంది.

ప్రగతి

అంతే కాదు స్వాతంత్ర్యం రావాలంటే మనం ఏం చేయాలో కూడా తెలుస్తుంది. అందరం కలిసికట్టుగ వుంటే ఎంత లాభమో తెలుస్తుంది.

నాగయ్య

అందులో 'విద్యరానివాడు వింత పశువు' అంటారు.

పాట

**విద్యరాని వారని మనల**
**వింత పశువు లందురు**
**చదువు నేర్చి దోపిడి దొరకు**
**ఎదురు తిరుగా లందరు** ॥విద్య॥

రైతు

ఎదురు తిరుగుతం సత్యమే. కని దొరను ఓడిస్తామా ? అని

నాగయ్య

దొర మనలెక్క మనిషే. మనమే భయపడుతున్నాం. అందరం సమానమే.

రైతు

ఎంతైనా శేతికి అన్నియేళ్లు ఒక తీరుగ వున్నాయా ?

ప్రగతి

ఐదువేళ్లలో ఒక్క వేలును
కాదని పని చేయలేం
వేలు వేలు వేరుగ వున్నా
కలుపుకుంటేనే బలం ॥ఐదు॥

నాగయ్య

మనకసలు జగడాలే రావద్దు. వస్తే అవి దొరదాక పోవద్దు.

పగలు మనలో రగిలించేటి
జగడములు పోవలె
ప్రజలే పంచాయతులను స్థా
పనము చేసుకోవలె ॥పగ॥

ప్రగతి

మనలో జాతి మతకుల భేదా లుండరాదు.

మనుషులందు రెండే జాతులు
ధనికు లంటూ బీదలంటూ
పేద హిందువు పేద ముస్లిము
పేద క్రైస్తవు లొక్కటే ॥మను॥

నాగయ్య

మనదొర రెడ్డి అనీ, నైజాం రాజు తురక అనీ మీకందరికీ తెలుసు కానీ....,

రామిరెడ్డి రాక్షసుడైన
రెడ్డికులము శత్రువుకాదు
తురక రాజు శత్రువె ఐన
తురకపేదలు శత్రులుకారు ॥రామి॥

ప్రగతి

అంతదాక ఎందుకూ?

ముస్లిమైనా మన కవి మగ్దూం
మొహియొద్దీన్ నాయకుడే కద
మగ్దుము విప్లవ కవితలకు
ముగ్ధుడై పోవడె సుద్దాల? ॥ముస్లి॥

రైతు

మరీ కులభేదాలు అసలుకే లేవంటే ఎట్లబ్బ! ఎనకటి నుంచి వున్నవాయె. అవి మనం పెట్టుకున్నవా ఏంది?

నాగయ్య

అందుకనే సుద్దాల కవి ఒక గేయం వ్రాశాడు.

ప్రగతి

అవునవును, వినుపించు ధామన్నయ్యా

నాగయ్య

పాట

కులము కులమంటూ - మనము
కొలుచు కోరాదు
వేదకాలము లోన చూడు
లేదు కులముల తగవునాడు
మనము ఏ పని చేసినామొ
ఆ పనియె కులమయ్యెను నేడు॥కులము॥

ప్రగతి

మతము మతమంటూ - మనకు
మతులు చెడరాదు

మతము లన్నీ చదివి చూడు
మమత కలదు కలిసి పాడు
జాతిజాతికి వేరులేదు
ఈతిబాధల మొదలగోడు ॥మతము॥

నాగయ్య

మనుషు లందరిలో - ఒకటే
మనోవేదనలు
ఈ కలియుగ మందు చూడ
ఆకలీ కన్నీరు లేదా?
ఏ కులానికి ఏ మతానికి
వ్యాకులములో లేదు తేడ ॥మనుషు॥

ప్రగతి

తలలు తెగి రాలే - ద్వేష
జ్వాలలే మిగిలే
మతపు లోతులు తెలియలేక
మతులు చెడెను గతులు చెడెను
నాది నాదని నీది కాదని
వాదులాయె బాధలాయె ॥తలలు॥

నాగయ్య

మతము లన్నియునూ - తెలిపే
మమత ఒకటేను
శాంతి కోరెను గాంధితాత
శాంతి కోరెను గదనే మహమదు
శాంతిదూత మేరితనయుడు
శాంతినేత బుద్ధదేవుడు ॥మతము॥

ప్రగతి

ప్రజలకవి తెలిపే - పాట
ప్రజలలో విలిపే
ఒకే వింగి ఒకే నేల
ఒకే నీరు ఒకే గాలి
అందరి కన్నీరు ఒకటే
అందుకే మనమంతా ఒకటే ॥ప్రజ॥

రైతు

నిజం మాటేనమ్మ ! మీరు చెప్పింది. సరే! పొద్దుపోయింది. పోయి వస్తం మరి.

(అందరు నిష్క్రమిస్తారు)

మరునాడు ప్రజలనుద్దేశించి నాగయ్య. ప్రగతి

సోదరీ సోదరులారా ! మనం ఎంతో కాలంగా దుర్మార్గులైన దొరలకు వెట్టి చేస్తున్నాం. ఇక ఈ తెల్లిఖిల్మాలిన పని మానెయ్యాలి.

నాగయ్య

అవును శ్రమకు విలువ తీసుకోవాలి.

పాట

చిల్లిగవ్వ యివ్వవి దొరలకు
చెల్లిపోయిరి తండ్రులు తాతలు
పగలు రేయీ చాకిరిచేసి
పసుల కన్నా హీనమైతిమి
ఎంతకాలం చేసేదారయ్యా - నాయన్నలార !
కొంత ఆలోచించండోరయ్యా ॥నాయ॥

ప్రగతి

కరుణలేని కరణం సామికి
దొరను నేనను నరకాసురునికి
రోగమొచ్చి పడిపోయిననూ
జాగుసేయుగ రాదు పనికి
ఎన్నో ఓర్చి పనులు చేసినను - నాయన్నలారా
తన్నులు తప్పినవా యెప్పుడును ॥నాయ॥

నాగయ్య

అన్నా! నిన్నగాక మొన్న
మొన్న కచ్చురాము ముందు
ఉరుకలేక పడిపోతేను
ఉరుకు మని యెడ్లను గెదిమిరి
నెత్తురు గక్కి విడిచే ప్రాణాలు - నీ కన్నకొడుకు
ఇత్త మింకా యెన్ని ప్రాణాలు ॥నాయ॥

ప్రగతి

కన్ను తెరవని నెత్తురు గుడ్డును
కన్న తల్లిని కరుణించయ్యా
పచ్చి బాలెంతను నే మీకు
పనులు చెయ్య రాలేనంటే
దొప్పలో పాల్పిండి రమ్మనిరి - మన యక్కలాను
తిప్పలింకా యెన్ని పడుదాము ॥నాయ॥

నాగయ్య

దున్నువానికె భూముండాలి
పన్ను లెందుకు దొరకివ్వాలి?
మనుషులంతా ఒకటైనపుడు
మనము వెట్టెందుకు చెయ్యాలి

ధనికవర్గం పుట్టించిందయ్యా - ఈ వెట్టిచాకిరి
కనుక కన్నులా తెరవండోరయ్యా ॥నాయ॥

ప్రగతి

దొరల రాజుల అన్యాయాల
దోపిడీ నిర్మూలన కోసం
బరువు బతుకుల బాగుకోసం
తిరుగుబాటు పోరు కోసం
పిలిచె కవి సుద్దాల రారండి - నాయన్నలార
తెలివితో సంఘంలో చేరండి ॥నాయ॥

నాగయ్య

నినాదాలు చేయండి. రైతు సంఘాలు !

ప్రజలు

వర్ధిల్లాలి !

ప్రగతి

కూలి సంఘాలు !

ప్రజలు

వర్ధిల్లాలి !

పాట - నాగయ్య

రైతు సంఘము - ప్రవ
ర్ధిల్లాలి కూలి సంఘము ॥రైతు॥
నిరుపేదల నొకటిగా
పిలిపేదే సంఘము
తప్ప దింక తరతరాల
దోపిళ్లకు భంగము ॥రైతు॥

ప్రగతి

వెట్టిచాకిరి - జా
గిర్దారులు పెట్టిన ఉరి ॥వెట్టి॥
కామా మనుషులము ?
కారాదు బానిసలము
కట్టుగట్టి వెట్టివాళ్ల
కదలినచో విజయం మరి ॥వెట్టి॥

నాగయ్య

రౌడీబలము - ఇం
కేడ నిలుచు కలకాలము ॥రౌడీ॥
పశుబలమ్ము తోటి యెపుడు
పాలించగ లేరెవ్వరు
అణగి వున్న మనము లేచి
దును మాడిన ఎదురురారు ॥రౌడీ॥

ప్రగతి

అందరు సంఘంలో....

ప్రజలు

చేరాలి !

నాగయ్య

స్వాతంత్ర్యం !

ప్రజలు

మా జన్మహక్కు !

ప్రగతి

అన్నయ్యా ! దూరంగా కచ్చేరు ముందు ఏదో గుంపు కూడింది.

నాగయ్య

అవును పద. లేవీ కోసం, పన్నుకోసం పటువారి ఏంచేస్తుండో ఏమో !

(నిష్క్రమిస్తారు)

పటువారి స్వామిరావు, సేత్‌సింది శీతయ్య వస్తారు

స్వామిరావు

ఒరే శీతిగా! ఆ ముత్తిగాణ్ణిటు గుంజుకరా! పన్నుగట్టుమంటె నకరాలు జేస్తున్నరు ఆ నాగడు ఒద్దన్నడట. పీళ్లు ఇయ్యరట. తంతే లంజాకొడుకులు రక్తం గక్కుతరు. ఒక్కన్ని ముందు మక్కెలిరుగ దంతె అందరికి బుద్ధొస్తుంది.

శీతయ్య

పోత చిన్నదొర !

లోనికి వెళ్లి రైతు ముత్తయను తీసుకవచ్చి

ఇగో చిన్నదొరా !

స్వామిరావు

అరే వాన్ని ఒంగబెట్టి రాయివెట్టు

రైతు

ఒద్దు దొరా బాంచెన్ !

స్వామిరావు

మీరు బాంచెలా? అమ్మో ! మీకు బాగ గర్ర పెరుగుతుందిరా బంచోత్ ! కట్టు పన్ను. అప్పు మొత్తం గట్టు.

రైతు

నోట్లె పోసుకుందామంటె గంజిబొట్టు లేద్దొరా ! ఇంక పైసలా? అవ్వతోడు దొరా !

సంవాదం - పాట

ఒక్క పైసాలేదు బాంచెను
ఒక్క కావోణ్ణి ఓ దొర! ॥ఒక్క॥

డొక్క నిండా తిండే దొరుకని
దిక్కులేని ముండా కొడుకుని
గుక్కెడంతా గంజే లేక
ఒక్క కొడుకు ఒరిగిపాయె ॥ఒక్క॥

శీతయ్య రైతును వంగబెట్టి వీపున రాయిపెడతాడు

స్వామిరావు

భాగోతుల ఏడ్పు నాకు
బాగ తెలుసురా ఒరే! ॥భాగో॥

పగల నాటకాలు మాని
వేగ భూమిశిస్తు గట్టు
లేని పన్ను వచ్చెను మరి
లేని శిస్తుతోని గట్టు
పన్ను గట్టెదాక
ఎన్ను మీది రాయి
మన్ను బుక్కినగాని
ఎన్నడు దింపను ॥భాగో॥

రైతు

ఉన్న గుంటెడు పొలమునంత
దున్ని పండించ ఓ దొర! ॥ఉన్న॥

అన్ని ఒడ్లు బాకీ కింద
తన్ని గుంజుకుంటిరయ్యా

ఎన్నిసార్లో కొలిసినగాని
ఎన్నటికి మీ మిత్తి తీరదు ॥ఉన్న॥

### స్వామిరావు

అరే! అంటె ఎన్నిసార్లిచ్చినా అప్పు ఇవ్వనట్టు దొంగలెక్క చేస్తమంటావురా? దొంగముండా కొడుక! తన్నినామేం? తన్నకుంటె మీరు ఆజ్ఞల వుంటార్ర?

రెట్ట లిరిసి తన్నకుంటే
వెట్టి చేస్తరా ఒరే! ॥రెట్ట॥

కట్టి తోలు తియ్యకుంటె
ఇట్టి భయము లుంటారా?
పట్టపగలె తలలె త్తి
చెట్టులోలె నిలుచోరు?
కొట్ట కుంటా మీకు
బొట్టు పెట్టేందుకు
పుట్టినార్రా మాకు
తట్టు కొడుకుల్లారా! ॥రెట్ట॥

### నాగయ్య ప్రగతి వచ్చి

### నాగయ్య

ఆగండి కరణంగారూ! ఏంటి దుర్మార్గం?

### స్వామిరావు

దుర్మార్గం లేకుంటే పన్ను వసూలయితాదీ?

### నాగయ్య

పన్ను గట్టాలా? మరి మీరు కట్టారా? పన్ను? ఎనభై వేల యెకరాల మీ దొర, ముప్పైవేల యెకరాల నువ్వు. కట్టావా పన్ను?

స్వామిరావు

మమ్మల్ని పన్ను గట్టుమంటావా నువ్వు?

నాగయ్య

ముందు ఇతన్ని వదలండి. చెప్పుకోండి మీ దొరకు.

కాలు తీసివేస్తాడు

స్వామిరావు

అరే! నాగయ్యా! దీని ఫలితం అనుభవిస్తావు.

నాగయ్య

అరే తోరె అంటున్నావు. మర్యాద తప్పితే పరిస్థితే తారుమారవుతుంది.

సంవాదం - పాట

సారా తాగి స్వామిరావు
మీకుమంటిరి - మరి ||సార||

కిర్రు చెప్పులతోని తెగ
ఒర్రుచుంటి రేల మీరు
త్వరగ ఇంటి విడుపకున్న
విరిగిపోవు కాళ్లు కీళ్లు
మీరి వాగారంటె
పారి పోరిత జనులు
చర్నకోల బట్టి
చర్మాలు దీస్తారు ||సార||

స్వామిరావు

జనమంతా నీ చేతిలో ఉన్నట్లే ఫోజుగొడుతున్నావే అయినా ఈ జనమంత? ఇంట్లో చెప్పు విసిరేస్తే కుండకు తాకదు గని. పెద్ద పెద్ద బడాయికోరు మాటలు.

వచ్చినాడు చూడండి
సచ్చమంతుడు- అరే ॥వచ్చి॥

తుచ్ఛమైన వెధవలతో
పిచ్చికుంట్ల సంఘమట
చచ్చు మాటలోడు వీడు
అచ్చమైన నాయకుడట
వచ్చిండంటె దొర
రెచ్చిపోతా డింత
లచ్చనంగ తల
పుచ్చెగిరి పోతుంది ॥వచ్చి॥

నాగయ్య

స్వామీ ! ఓ పిచ్చిస్వామీ !

తుచ్ఛ మైనవారు కారు
విచ్చు కత్తులు - జనులు ॥తుచ్ఛ॥

స్వచ్ఛ మైన మనసులున్న
మచ్చలేని చంద్రులు
రెచ్చ గొట్టితే మరి కా
వచ్చు విష్ణుచక్రాలు
కొడవళ్లు చే బూని
కదలి వోలె పొంగి
చీరి వేసే రోజు
దూరమెంతో లేదు ॥తుచ్ఛ॥

పిచ్చి పిచ్చి వేషాలు వేయకండి. లేపీ గీపీ ఏపీ అడుగొద్దనీ ఇంతదాక దోచింది బోలెడంత అయిందని చెప్పండి మీ దొరగారికి.

ప్రగతి

అన్యాయంగా వడ్డీలకు వడ్డీలు పెంచిన అప్పులమీద కూడ ఆశ వదలుకొండి.

(కరణం, సేఠ్‌సింది నిష్క్రమిస్తారు)

రైతు

బాబూ ! మూగ్లే నక్కమీద తాటిపండు పడ్డట్టు ఈ లేవీ ఏందయ్యా ?

సంవాదం - పాట

ఈ వూరి పీడ ఇం
కెన్నాళ్ల బాకుందో
చావైన రాకున్నది - ఓ నాగన్నా ॥చావై॥

కావగా రాలేదు కండ్లు
చెవులు లేవి రాతిదేవుడు
చావటానికి విసములేదు
లేవి గల్లెటు కొలువవలెను ॥ఈవూ॥

నాగయ్య

జర్మను వానికి
ఇంగ్లీషు వానికి
జరిగేను పోరాటము - ఓ అన్నయ్యా ॥జరి॥
ఇంగి లీషువాని కెపుడు
లొంగి తిరిగే నిజామోడు
వంగబెట్టి దోచి యివ్వగ
దొంగ లేవీ మనకు వేసె ॥జర్మ॥

రైతు

బాగుందయ్యో ముచ్చట

కాకులను గొట్టును
గద్దలకు పెట్టును
కాకి శోకమె మిగులునా - ఓ నాగన్నా ॥కాకి॥

నూకలే పండించలేవి
మాకు యుద్ధపు సంగతెందుకు ?
ఎక్కడేదో జరుగుతుంటే
ఇక్కడ దిగ్గొయుగుదెందుకు ॥కాకు॥

నాగయ్య

కాకి శోకమ్మేల ?
ఏకమ్మి కాలేర ?
ఒకసారి మీరందరు - ఓ అన్నయ్యా ॥ఒక॥

ఒక్క కట్టుగ మీరు వుంటే
ఒక్కడు లేచీకి రాడు
బక్కవారని బెదరవద్దని
వొక్క యనె సుద్దాల సుకవి ॥కాకి॥

నాగయ్య

కాబట్టి అన్నలారా ! సంఘం జెండా క్రింద మనమందరం ఏకమైతే ఎవ్వరూ ఏంచెయ్యలేరు.

ప్రగతి

ప్రజాసంఘాలు ?

ప్రజలు

వర్ధిల్లాలి !

(అందరూ నిష్క్రమిస్తారు)

## ద్వారికో సేత్సింది శీతయ్యా, కరణం

### శీతయ్యా

ఏందొరా ! ఒక ముచ్చట. నేను సిన్నప్పటినుంచి మీ దొర బోగం సూసినోన్ని కాని ఇపుడు ఈ నాగన్న పెరిగినకాన్నుంచి సూడబోతే....,

### సంవాదం - పాట

చిన్నదొరా ! మీ యధికారముపై
మన్ను బోసె దిన మొచ్చెనుగా
అన్నగాను పేరొందిన నాగయ
కున్న జనబలము పెరిగెనుగా ॥చిన్న॥

### స్వామిరావు

దున్నపోతులా అరవబోకు మా
కున్న బలము నీకేమెరుక ?
పిన్న మొన్నటి పోరడు నాగడు
దన్ని వేసెదము తడ్డబడక ॥దున్న॥

### శీతయ్యా

విన్నాను ఇటువంటి యేతులిం
కెన్నెన్నో మరి మీ నోట
కన్నులు తెరిపించెను ప్రజలందరి
మన్ననతో నాగన్న యిట ॥విన్నా॥

### స్వామిరావు

చాన్నాళ్లుగ ఓపిక పడితిని యిది
చిన్న మొక్క యని అనుకుంట
అన్నము వానికి కరువు చేయుటకు
కన్నురెప్పపాటుర శీతా ! ॥చాన్నా॥

శీతయ్య

విన్న వింత ఏమనకుంటే ఒక
ఉన్నమాట నేసే దినము
చిన్నగ మార్పులు తెచ్చే ఆ నా
గన్న వెనుక వున్నది జనము ॥విన్న॥

స్వామిరావు

తన్నించెదరా అమీనుతో నా
గన్న వింక నే నొదలనురా
తన్నినంక వినకున్న వాడికి
ఉన్నది నరకమ్మొకటేరా ॥తన్ని॥

(నిష్క్రమిస్తారు)

రామిరెడ్డి గడి

రామిరెడ్డి

ఒరే శీతిగా !.... ఒరే శీతా ! ఓహో మరచిన. నాగన్నను తోలుకరమ్మన్న గదూ ! ఇంతసేపాయె రాకపోయె

శీతయ్య ప్రవేశించి

దండం బాంచెన్ ! నాగన్న వత్తుండు

రామిరెడ్డి

అచ్చా ! నువ్వెల్లి పాటక్కాడ వుండు

నాగయ్య ప్రవేశం

రామిరెడ్డి

స్వాగతం ! ప్రజలకోసం పాటుబడే మహానాయకా ! సుస్వాగతం! కూర్చోండి.

సంవాదం - పాట

స్వాగతం - విరుపేద నాయకుడా ! సు
స్వాగతం
స్వాగతం ఈ జగతిలోవి దు
రాగతాలను రూపుమాపే
ప్రగతినేతగ అవతరించిన
యుగ పురుషుడు కాపునాగయ ॥స్వాగ॥

నాగయ్య

ఈ వ్యంగ్యం అర్థమైంది గని సంగతి వివరించండి.

రామిరెడ్డి

కు సంగతి వివరించాలా మహానుభావా !

నాగయ్య

ాలు. ఆపండి మీ కుటిల వినయాలు

ఎందుకూ- ఈ వంగనాచి నక్క-వినయా
లెందుకూ
ఎందుకూ ఈ పొగరు మాటల
చిందు లాటలతోవి ఝరిలా
ముందు కురికే ప్రజాసేనకు
ముందు నిలిచి భంగమొందకు ॥ఎందు॥

రామిరెడ్డి

ం. పిట్ట కొంచం కూత ఘనం

విన్నాను - నువ్వూర వూరకూసె కూతలు
విన్నాను

మన్ను మిన్నూ గానలేక
కన్నులకు పొగరెక్కి జనులకు
పన్నులను ఎగవేయుదంచు
ఎన్నో నేర్పుతున్న వని నే ॥విన్నా॥

నాగయ్య

ఇవ్వమూ- ఈ నిలువుదోపిడి పన్నులివ్వ
నివ్వమూ
ఇవ్వమంతే కాదు చెయ్య
నివ్వమింకా వెట్టిచాకిరి
బువ్వలేని బతుకులను కొని
కొవ్వు బలిసి కాలుదువ్వకు ॥ఇవ్వ॥

రామిరెడ్డి

ఆం. తొండ ముదిరి ఊసరవెల్లి అయిందే. ఒరే పిచ్చుకా !

పిచ్చుకా - పులినే బెదిరించెదవా
పిచ్చుకా !
పిచ్చుకలు మీ ప్రజలు మొత్తము
మెచ్చుకోకు నీకు నువ్వే
మచ్చుకొక్కడు మిగలకుండా
ఉచ్చుపెట్టెద రెచ్చగొట్టకు ॥పిచ్చు॥

నాగయ్య

మీరింకా తాతల కాలంలోనే ఉన్నారు. రోజులు మారాయి అయినా ...,

మారదూ - మీ తరతరాల దొరలబుద్ధి
మారదూ
మారదింకా నరనరమ్ముల
పారుతున్న క్రూరవైఖరి

నేరమని మీరెరుగు కాలము
దూర మెంతోలేదు ఖర్మ ॥దూర॥

రామిరెడ్డి

ఎవరిదో- ఖర్మము కాలికూలేది
యెవరిదో
ఎవరిదో పోరాటమందున
చివరి విజయము లేక మరణము
తీవరమ్మగు నీదు పోకిరి
కావరమ్మణచేటి మగసిరి ॥ఎవ॥

నాగయ్య

బెదరనూ- తుదకు ప్రాణము పోతెపోనీ
బెదరనూ
నిదురబోయే ప్రజాశక్తిని
కుదిపి లేపకమానను నా
కెదురులేదని యెగిరిపడు నీ
కెదురు సంఘము నిలుపగ నే ॥బెద॥

రామిరెడ్డి

ఆ(. అంతదాకా వచ్చావురా? అట్లైతే,

తప్పదూ- ఎప్పటికినీ నాచేత చావు
తప్పదు
తప్పుకొన లేవింక నీవు
తప్పదింకా నీకు చావు
ఉప్పునకు గతిలేని నీవు
గొప్ప నేతగ చెప్పుకున్న ॥తప్ప॥

నాగయ్య

'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు'—గనుక

చచ్చినా- ఆగదుగా నా తిరుగుబాటు
చచ్చినా
చచ్చు పుచ్చుది కాదు సంఘము
చిచ్చువలె చెలరేగు నిత్యము
విచ్చుకత్తిగ నీదు గుండెల
చొచ్చుకొని పొయ్యేది సత్యము ॥చచ్చి॥

రామిరెడ్డి

అట్లనా ! సరే చూస్తాపో.

(నిష్క్రమిస్తారు)

నాగయ్య ఇల్లు

అన్నపూర్ణ

ఏమయ్య ! నేనొక ముచ్చటంట. ఏమీ అనుకోరుగద.

హనుమయ్య

నువ్వు కొంగుతోని చెయ్యి తూడుసుకుంట దగ్గెరకొస్తుంటేనే అనుకున్న నీవేదో ముఖ్య విషయం చెబుతావని

అన్నపూర్ణ

'ఊరికి చేసిన సేవ పీనుగకు చేసిన శృంగారం' ఒకటే అంటరు. మన నాగనికి వ్యవసాయం చేయటం ఇష్టం లేకుంటే ఏదో తమ్మునితోని చేయించుకుంటే సరిపాయె.

హనుమయ్య

అసలు సంగతేంది ?

## సంవాదం - పాట

### అన్నపూర్ణ

దొరల గొడవెందుకు - వారలపైన
దురుసు తపమెందుకు
అరువది వూరుల
దొర పెత్తనముపైన
శిరమెత్తి ఎదురించె
చొరవేమి నాగనికి ॥దొర॥

### హనుమయ్య

భ్రమలో అనుచుంటివో - నాగయ్యను
ఏమి యనుకుంటివో
యముని రాజ్యమున ని
త్యము దుఃఖపడుతున్న
నిరుపేదలకు వాడు
చిరుదీప మైనాడు ॥భ్రమ॥

### అన్నపూర్ణ

ఏమి దీపమ్మలో - నాకే మెరుక
రామా పుర మందులో
పాములను మించిన
రామిరెడ్డి దొర
బుసకొట్టి నాగనిపై
కసి పెంచు కొనునేమొ ॥ఏమి॥

### హనుమయ్య

అన్నపూర్ణా ! స్వాతంత్ర్యం కోసం పోరాటం చేసేవాడికి పాములు ఎదురుకాకపోతే పావురాలు ఎదురౌతాయా ? అయినా విషసర్పాలకు జడిసి ఆశయాలను చంపు

కునేవాడు కాదు మన నాగయ్య. దొరకు భయపడే పిరికివాడు అంతకన్నా కాదు.

అన్నపూర్ణ

నాకు తెలువక అడుగుత. మనమేమన్న గాంధీలమా ఏంది?

పేదప్రజ లెందుకు - నా నాగన్న
బాధ పడు లెందుకు
భూదేవి దయమీద
ఏదో భుక్తిని పొంది
మన యింట్ల మనముంటె
కనుల పండుగ నాకు ॥పేద॥

హనుమయ్య

బోలా తనమందున - నిన్నీవేళ
బేల వని యంటున?
బలమున్న దొర నంచు
బలిపెట్టే గ్రామాల
ముక్తిసంఘపు జీవ
శక్తి మన నాగయ్య ॥బోలా॥

అన్నపూర్ణ

కన్న కడుపన్నది - మీతో నిపుడు
ఇన్ని అంటున్నది
చిన్నోడా దొరగాడు?
ఎన్నో పాపాలోడు
నాకన్న కొడుకునకు
ఇక ఎన్నికష్టాలో ॥కన్న॥

హనుమయ్య

ధరణీ తలమందున - కలిచంద్రుల
గౌరవము పిల్చిన
వీరుడై విప్లవపు
దారిలో నాగయ్య
తెలుగమ్మ కన్నీరు
తొలగించే యోధుండు ॥ధర॥

అన్నపూర్ణ

ందో పోనియ్యండి. నేనొక పిచ్చిదాన్ని. మరీ పెండ్లన్న చేస్తవా లేదా గనికి?

హనుమయ్య

ాన్ని రెండేండ్ల కిందనే అడిగిన. ఇపుడే ఎందుకు అంటె ఊకుంటిమి. వాని ళ్యాణం చేయాలని నాకు మాత్రం ఉండదా ఏంది?

అన్నపూర్ణ

ఎరొక్కసారన్న వాన్ని అడుగొద్దా?

హనుమయ్య

గో వాడొస్తున్నట్టున్నడు అడిగిసూడు.

(నాగయ్య ప్రవేశిస్తాడు)

అన్నపూర్ణ

ాగి! వచ్చినావా తండ్రీ!

## సంవాదం - పాట

కన్నా రారా - ఒకమాట నా
గన్నా రారా
ఎన్నొ రోజుల నుంచి
ఉన్న కోరిక వినగ ॥కన్నా॥

### నాగయ్య

ఏమిటమ్మా - మీ కోర్కె- అ
దేమిటమ్మా ?
మీ మాట తెలుపంగ
మోమాట పడనేల ? ॥ఏమి॥

### హనుమయ్య

తల్లి ఆశ - తెలియును గద నీ
పెళ్లి ధ్యాస
ఇల్లాలితో నీవు
దల్లి గుండాలనే ॥తల్లి॥

### అన్నపూర్ణ

పల్లకీలో - నిను చూడగ ఈ
తల్లి కళ్లు
అలలు అలలుగ ఎన్నొ
కలలు గంటున్నాయి ॥పల్లి॥

### నాగయ్య

అమ్మా ! మీరు బాధపడతారని ఇంతదాక చెప్పలేదుగాని....,

వలదోయమ్మా - తనయుని మీద
కలలో లవమ్మా!
పెళ్లి తలపే తప్పు
నే వెళ్ల దారిలో ॥వల॥

అన్నపూర్ణ

హరి హరీ!

చింత కలిగే - నీ మాటతో
శాంతి తొలిగే
అంతులేని బాధ
అంతా చీకటి చేసె ॥చింత॥

హనుమయ్య

ఏల బాపూ - ఇంతటి కఠిన
మేల తెలుపు?
ఇలలో మానవసేవ
కుల పెళ్లి కాలేద? ॥ఏల॥

నాగయ్య

నాన్నా! మానవసేవ చేసే సాత్త్వికమ ర్గం కాదుగా నాది....

సంఘంలోన- నిల్చితిని రణ
రంగం లోన
సంగరమ్మున క్షణ
భంగురము మా బ్రతుకు ॥సంఘ॥

అన్నపూర్ణ

హరిహరీ! పెళ్లి వద్దైతె వద్దాయె గనీ అట్లనకు నాయినా

రామ రామ - యెంతటి మాట
క్రిష్ణ క్రిష్ణ
వినలేను నాగయ్యా
విని బతుకలేనయ్యా ॥రామ॥

హనుమయ్య

నాయనా! బ్రిటీషు ప్రభుత్వంతో స్వాతంత్ర్యానికై పోరాటం సాగిస్తున్న మహాత్ముడు

ముందు సేతై - నడిచే నదిగో
గాంధి తాతై
వందనీయుడు తాకి
బంధమ్మ వదిలేన? ॥ముందు॥

నాగయ్య

నాన్నా! ఆయన దారి వేరు. నా దారి వేరు.

ఇదహింస త్రోవ - కాదే పరమ
హింస సేవ
నాది మన అల్లూరి
రుధిర తర్పణ సేవ ॥ఇద॥

(నిష్క్రమిస్తారు)

సేత్‌సింది ముందు నడవగా, రామిరెడ్డి కొబ్బరి తోటకు
వెళ్ళుతుంటాడు

రామిరెడ్డి దూరం నుండి వస్తున్న ప్రగతిని చూసి

ఒరే సేత్‌సిందీ!

శీతయ్య

చెప్పండి దొర. కాల్మొక్త.

రామిరెడ్డి

మా కొబ్బరితోట్ల నుంచి ఎవ్వరిరా? జింకపిల్లలెక్క గంతువేసుకుంట ంది.

శీతయ్య

? ఆ మలుపుకాడి నుంచి కదా బాంచెన్! శేతుల పెద్దగా కొళ్ళగా కొడువ ది కాలుమొక్త.

రామిరెడ్డి

ష్ఠ గాడిదకొడుక! దాని సిగలో తెల్లపూలు, తెల్ల చీర, తెల్లజాకెట్, సన్నటి ము, బరువైన పరువాలు కనపడ్తలేవారా!

శీతయ్య

ానయ్యా! నా కండ్లంత దూరం సూచయిగని బాంచెన్! ఆ సల్లటి కొడువలి కత్తోలె కనవడ్తుంది. అయినా యిటే వత్తుంది గదా తెల్తుంది కాల్మొక్త. ఆ ువలి యెట్లుటందో!

రామిరెడ్డి

ష్మయ్. దాని అందం చూడరా అంటే కొడువలి కొడవలి అదేమాట గుడ్డి ండాకొడుక!

శీతయ్య

ప్పె దొరా! అగో దగ్గిరకి వత్తుంది. కత్తే. కాదుకాదు కొడువలే దొరా!

రామిరెడ్డి

ంతే బొక్కలిరుగాలి. గాడిదకొడుక! మళ్లె కొడువలి ముచ్చటేందిరా?

(శీతయ్య నిష్క్రమిస్తాడు)

## ప్రగతి ప్రవేశం

### రామిరెడ్డి

ఏయ్ పిల్లా! ఎవతివే నువ్వు. ఈ రామిరెడ్డి దొర అందమైన కళ్లకు కనబడని నీ కందురీగ నడుము చూస్తుంటే మతిపోతుంది. ఏ వూరే నీది?

### ప్రగతి

ఏయ్ రామిరెడ్డి! మర్యాద....

### రామిరెడ్డి

ఆహా. నన్ను పేరుపెట్టి పిలిచిన మొట్టమొదటి నెరజాణా! ఎంతో మంది కన్నె పిల్లల్ని పక్కలో చేర్చుకొని పంపించిన నాకు నిన్ను చూస్తె పర్మనెంటుగ పెళ్లి చేసుకోవాలని అనిపిస్తుంది. ముసలైన దొరసాన్ని మూలకుంచుతానే నువ్వు సై అంటే. మొత్తానికి నువ్వు నచ్చావె నా పాలిటి రంభా! అవునూ ఇంతకూ....,

### సంవాదం - పాట

**ఇంతి! యే యింటిజాబిల్లివే - ముద్దుల పూ**
**బంతీ! యే వీధిరాణివే**
**తీరు- చేమంతి పువ్వుల తేరు**
**నీ సాటి కన్నెలిల లేరు**
**దివికాంతలైన సరిరారు**
**నినుచూడ కోరికల పోరు**
**చెలరేగె గుండె దడహోరు**
**శోభాంగి తెలుపు నీపేరు**
**నిను గన్నోళ్లకు జోహారు**
**పలుకవేలనే పల్లె రంభ నీ**
**ఒళ్లు చూసి నా కళ్లు తిరిగెనే ॥ఇంతి॥**

## ప్రగతి

ఓ రామిరెడ్డి! కళ్లకు పొరలెక్కితే ప్రతి ఆడది రంభలాగే కనబడుతుంది. నన్ను చులకనగా అనుకుంటే తలకిందులవుతావు జాగ్రత్త!

దారికెదురుగ నిలువబోకు - నాతోడ నీవు
కొరు కూతలు కూయబోకు
మీరి - జంపువ తిరుగ ఇటు దూరి
చెడు నుడుగులతో నను చేరి
ఆపదలను పొందకు కోరి
సుకుమారిగ తలచకు రోరి
కనిపించును నాలో మారి
చూపింతును నరకపు దారి
మర్యాదగ వెళ్లుము రోరి
చాలు చాలు నీ పలువ కూతలిక
జోలి వదలుకొని యిల్లు చేరుకో ॥దారి॥

## రామిరెడ్డి

చెల్లి నీవెన్ని యన్నగాని - ఓ సుందరీ! విరి
జల్లులో తడిసెనే యీ ప్రాణి
కళ్లు - రసపిపాసులకు సంకెళ్లు
రతిసదనానికి వాకిళ్లు
ఆ స్వర్గమునే సికిళ్లు
చేయింతు విప్పు నీ ముళ్లు
పోదాం పదవే పొదరిల్లు
వెనకాడక విడు సిగ్గుల్లు
సర్వాస్తి వ్రాసిన విల్లు
సొంతము చేతును వలపుమాపి నా
చెంత జేరు కాదంటె విడయక ॥చెల్లి॥

ప్రగతి

పిచ్చివాడా! నన్నెవరనుకున్నావు?

ధనముకై లొంగేవాడు కాదు - హనుమయ్య బిడ్డలు
జనముకై ప్రాణాలిచ్చేదారు
నేను- ఒక వేశ్యకాంతను కాను
'తుచ్ఛాస్తి' వాంఛలో లేను
పేరన్న యింట పుట్టాను
నాగన్న చేత పెరిగాను
'రైతూద్యమాన' దుమికాను
నీ దొరతన ముడిగిస్తాను
అని ప్రతిన యెపుడో చేశాను
తిమ్మారి మొత్తము చిమ్ముకోను సరి
కొమ్మలతో నీ దుమ్ముడిలింతును ॥ధన॥

రామిరెడ్డి

ఓహో! నాగని చెల్లివా?

ప్రగతి

నేనే ప్రగతిని.

రామిరెడ్డి

ఛ! నోర్ముయ్

శత్రుని యింటి పడుచుదాన - తెగనీల్గకే నా
చేత చిక్కావే అడజాన।
మొల్ల - నన్నాడించే రసగుల్ల
నీ ప్రతినలు తీపటి కల్ల
నీ అన్నగాడు ఒక దొల్ల

ఛీ హే ! తెల్లవారిపడికల్ల
మటుమాయం జేతునె మల్లి
మీ సంఘాలను ఒక పుల్ల
తీరుగ విరిచేతునె పిల్ల !
చెల్లబోదు నీ సొల్లు వాగుడిక
నల్లిలాగె మిము నలిపివేసెదను॥శత్రు॥

ప్రగతి

ఛీ రెడ్డి ! నోరు బలమే కాని బుద్ధిబలం లేదు నీకు. ధనం సంపాదించావుగాని జ్ఞానం సున్న. చరిత్ర చదివావా? ఇట్లాగే ప్రజల్ని ఎంత అన్నవాళ్లు ఏమయ్యారు? ప్రజాసేనముందు నిలువలేక నశించిపోయారు. నీవెంత?

హిట్లర్ ముస్సోలిని రషా జారు- నీకంటె ఘనులై
ఇట్లే పొగరెక్కి కూలినారు
ఎంతో వారెదమ కాలి చెప్పంత
కాబోదుర నీ బతుకంత
తొందర పడకుర నీ వింత
కను దెరుస్తుంది జనమంత
నీకే దుంచరు పినరంత
విను పూడ్చిపెట్టేది వింత
అనుకోక తెలుసుకో కొంత
రౌద్రమూర్తి నుద్దాం సాక్షి నీ
అంతము కొరకే పిలిచామంత ॥హిట్ల॥

ఇక నాపై చేయి ఎత్తావంటే పంచప్రాణాలు లాగేస్తాను. జాగ్రత్త !

(నిష్క్రమిస్తుంది)

### రామిరెడ్డి

అబ్బా! కాళి! భద్రకాళి! నిన్నుకాదు. [illegible] నీ [illegible] సంగతి తేల్చు కోవాలి. ఇప్పటికే సంఘాల గాలి అన్ని [illegible]పోయినవి.

(నిష్క్రమించి మళ్లీ ప్రవేశించి)

అరే శీతిగా!

### శీతయ్య

వచ్చిన బాంచెన్!

### రామిరెడ్డి

కరణాన్ని కలిసి అమీన్‌సాబును జల్దిగ పిలిపించి ఆ నాగని తోలు ఒలిపించు మను. రేపటి వరకు అమీన్ రావ పుండాలి.

### శీతయ్య

మంచిది కాల్మొక్త. ఇదే ముచ్చట మొన్న పట్వారిగూడ అంటుండె బాంచెన్

### రామిరెడ్డి

అట్లనా? అయితె సరెగనీ జల్దిన పో!

(నిష్క్రమిస్తారు)

## తెరలో ఉన్న అమీనుసాబు పరిచయం

### పాట - సూత్రధారి

గడ్డాము అమీను వచ్చేనయ్యా- అమ్మో
గడ్డాన్ని దువ్వుకుంట వచ్చేనయ్యా
తుపాకి చేతబట్టి పాపోసులను గట్టి
ఎర్రాటి గుర్రం [illegible] గుర్రుగుర్రు మనుకుంట ॥గడ్డా॥

ఊరోళ్ల గుండెలన్ని వణికేనయ్యా- అవ్వ
దొరోళ్ల బంగులాల పండుగేనయ్య
కోమటోని నేతిబొట్టు ఘుమ్మఘుమ్మ సారబొట్టు
గుడ్లు పెట్టి పెట్టిలాకు దుడ్డుపట్టి నేత్సింది॥గడ్డ॥

సంగపోల్ల నందరిని దొంగ లంటడు- వాడు
సందు జూసి పట్టుకోని కాల్చుతుంటడు
సంగపోల్ల పాట వింటె చెంగుచెంగు నెగురుతాడు
సుద్దాల పాటలంటె ముద్దరేస్త నంటాడు ॥గడ్డ॥

అమీన్

అరే ఎవర్రా! సబ్‌లోగ్ హాజర్ హై

సూత్రధారి

సబ్‌లోగ్ హాజర్‌హై. మీరు జరా జల్ది రాండ్రి మారాజ్

అమీన్

అచ్ఛీబాత్! సబ్‌కే సబ్ బంద్‌బస్తు హై

సూత్రధారి

అచ్ఛాహై మారాజ్

అమీన్ ప్రవేశం - పాట

గడ్డమమీను సాబును నేను
దొడ్డదొరల మేనల్లుడరా
దొర బురుజుల నొక చీమ కుట్టినను
దొరుకబట్టుకొని తోలొలిపించెద ॥గడ్డ॥

రజాకార్ల నాయకుండు కాశిం
రజ్వీసాహెబ్ దోస్తునురా
నిజాంషాహికి ఖిలాపుగాను
నిలిచిన సంఘం దుష్మనురా ॥గద్ద॥

తెల్లదొరలు స్వాతంత్ర్యమిచ్చినా
తెలంగాణమును వదలమురా
కాబోయే ఆజాదు నిజాముల
ఖబడ్దార్! నే యముండరా ॥గద్ద॥

పెటపెట లాడే పడుచు పిట్టలను
చిటెకలోన వేటాడెదరా
బట్టలు దీసి భర్తల ముందట
బతుకమ్మల నాడించెదరా ॥గద్ద॥

రామాపురి అల్కా నేనంటే
రాత్రి కూడ నిదురించదురా
రామిరెడ్డి జాగీరుదారుల
రాజసమును కాపాడెదరా ॥గద్ద॥

దొరతనమెద్దని పాటలు రాసే
తిరుగుబాటు నేనోర్వనురా
ధరణిలోన సుద్దాల హనుమడు
దొరికినచో నే విడువనురా ॥గద్ద॥

సూత్రధారి

అబ్బో! అబ్బో! గొప్ప తెలివిమంతులండి మీరు.

అమీన్

మరేమనుకున్నావ్‌గాని ఇదా సేత్‌సిందిని పిలుస్తావ్?

సూత్రధారి

అచ్ఛాహై మారాజ్

(నిష్క్రమిస్తాడు)

శీతయ్య ప్రవేశిస్తాడు

కాల్మొక్త. మీరు దొరకాడికే పోతుంద్రా

అమీన్

అవును పే దొర రమ్మన్నదని కరణం ఉత్తరం రాసిండు.

శీతయ్య

పటువారి దొరగూడ గడీలనే ఉన్నరు ఆడికే పొండ్రి బాంచెన్ !

రామిరెడ్డి గడి

సంవాదం - పాట

అమీన్

రాజాసాహెబ్ నన్ను
రమ్మన్న కారణంబేమి - తెలుపు స్వామీ!

స్వామిరావు

దొరవేగ ఎన్నెన్నొ
పనులుండి పిలిపించినాడు - విన్నవేడు

అమీన్

ధరలోన దొరగారి
పని చేయుటకె మేమున్నం - బతుకుతున్నం

స్వామిరావు

నైజాము రాజుకు
కుడి భుజము వోలె వున్నాడు - దొర యీనాడు

అమీన్

అందుకే పటువారి :
అస్త్ర అస్త్రకు మేము చేస్తం - దొరతో నేస్తం

రామిరెడ్డి ప్రవేశిస్తాడు

రామిరెడ్డి

ఓహోహో ఏం ప్రేమ ఈ దొరమీన

రామిరెడ్డి దొరకు
గడ్డ మషీనుకు దోస్తి - లాభం నాస్తి

అమీన్

అల్లా మీద ఒట్టు
అంతటి మాట అనవద్దు - కోపమొద్దు

రామిరెడ్డి

నైజాము రాజు మీ
కెందుకు కొలువిచ్చినాడు - పంపినాడు

అమీన్

దొరల జాగీర్దార్ల
దర్జాలు కాపాడుమని - భక్తితోని

రామిరెడ్డి

దొరల సేవలు మాని
దొమ్మరి గుడిసెల్లో మీరు - గడిపేదారు

అమీన్

తోబ తోబ ! మేము
పనివల్ల తమ దర్శనాము - మర్శినాము

రామిరెడ్డి

గడ్డ బలిసినంక
గడి యాదికొస్తుంద మీకు - చెప్ప నాకు

అమీన్

పర్మానులో మేము
మిమ్ముల చూడ రాలేదు - అలుగరాదు

రామిరెడ్డి

ఏమిటా పర్మాను
ఇప్పుడె జల్దిక చెప్పు - గుట్టు విప్పు

అమీన్

నైజాము రాజుకు
ఖిలాపుగా తిరిగేటోల్లన్ - ఎత్కుతున్నన్

రామిరెడ్డి

పోలీసు గుర్రాలు
రౌడీల బలగాలు లేవా - పట్టలేవా ?

అమీన్

ఎక్కడున్నా పట్టి
బొక్కల్లో పెడ్తాము మేము - బెదరబోము

రామిరెడ్డి

సరె గాని నా కొక్క
కీలాపుగాడు ఈనాడు - పుట్టినాడు

అమీన్

ఎవడయ్య దొరగారు!
మీకు ఎదురు నిలిశినోడు - గెలిశెటోడు

స్వామిరావు

నాగన్న అనెటోడు
సంఘమొకటి పెట్టినాడు - గట్టివాడు

అమీన్

ఆయ్ సంగం! మాదర్‌చోద్ కోన్‌హై?

ఇక్కడికి పిలిపించి
మక్కెలిర్గదంత చూడు - నేనునేడు

స్వామిరావు

ఇక్కడ తన్నొద్దు
కచ్చేర్ల తంతేనె వాడు - బెదరుతాడు

అమీన్

దొంగ కేసుల్‌బెట్టి
వంగబెట్టి తంతచూడు - లొంగుతాడు

రామిరెడ్డి

నాగన్ని తవ్విన
తర్వాతే నన్నొచ్చి కలువు - ఇంక శెలవు

అమీన్

అచ్చా హై మహరాజ
మెత్తంగ తన్నొస్త నేడు - దయజూడు

(అందరు నిష్క్రమిస్తారు)

అమీన్

అరే సేత్‌సింది!

శీతయ్య

అయ్యా! వస్తిని బాంచెన్

అమీన్

ండిరా నాగడు?

శీతయ్య

ప్పొచ్చిన దొర! వస్తుండొచ్చు.

నాగయ్య

మిటి అమీన్‌సాబ్ పిలిచారట?

అమీన్

కి గర్త బల్సిందని తెల్సింది. ఏమో సంగాలు గింగాలు పెడ్తున్నవట. ఏం
ంగతి? ఏమన్న గావల్నవే?

నాగయ్య

మర్యాదగా మాట్లాడటం నేర్చుకో.

అమీన్

నాకీ మర్యాద నేర్పుతున్నవ్‌లే

సంవాదం - పాట

అమీన్

ఎవ్వడవుర నువ్వు
గవ్వకు కొరగావు
దొంగలతో చేరి నీవు
సంగమొకటి బెట్టినావు
సంఘాంకు నిమిషంల
అంగర్ లగాదూంగ
జంగు చేస్తె కాల్చి
జంగల్‌మే ఫేక్దూంగ ॥ఎవ్వ॥

నాగయ్య

నేనే నాగయ్యన్
నేనే నాయకుడన్
మద గజమటు వంటి దొరకు
పదునౌ అంకుశమున్
అమీన్‌సాహెబ్ కాదు
నిజాం షాహి కూడ
సంఘముకు మాకు ఎదు
రుంగ నిల్వలేరు ॥నేనే॥

అమీన్

కొంగతనాల కెగబడి సంగం అంటావ్‌బే

తూర్పు గడిలో నువ్వు
గరిసె దోయించావట
దొరగారిని పిలువన
నరుకుత నన్నావట
మంది సొమ్ముల్ దోచె
బందీ పోటైనావ
బందర్ సాలె తుర్ఖికో
అందర్ కర్ దేవుంగ ||తూర్పు||

నాగయ్య

ఏందీ? మేము దొంగలమా?

కరణం ఒక లంగ మీ
దొరే పగటి దొంగ
దొంగల ముంగల లొంగిన
దొంగ కేంది దొంగ
పిల్లగంజి దాగి
ఒళ్లదున్న సాగి
ఒళ్లు వంచి ఎత్త
వోళ్లు దొంగలు కారు ||కర||

అమీన్

మమ్మల్నే దొంగలం [illegible]

లాల్ ఖానును కదితే
తోల్ తిరుగల దీస్తె
జూలు బట్టి కాలు బట్టి
కీళ్లను విరిచేస్తె
చెళ్ల చెళ్లన కొరడ
ఒళ్లు హూనం జేస్తె

కళ్లు తిరిగి నెత్రు
కళ్లన గక్కాల ॥లాల్॥

నాగయ్య

రోజులు మారాయి
ఫోజు లాపవోయి
రాజుల ఫర్మానాలు
బూజు పట్టెనోయి
కుక్క మొరుగుల్లకు
నక్క అరపుల్లకు
చెక్కు చెదరబోని
ఉక్కు గుండెలు మావి ॥రోజు॥

అమీన్

తెరి ఖూన్ పీలుంగ
తెరి జాన్ లేలుంగ
నెత్తుర్ నీది దొరకు
అత్తర్ దాలుంగ
రక్కసోన్ని నేను
డొక్కల పేగుల్దీసి
ముక్కల్ముక్కల్జేసి
తుక్కుల నక్కలకేస్త ॥తెరి॥

నాగయ్య

కత్తులు ఎదురైన
నెత్తురు వరదైన
కొత్త జగతికోసం
ఎత్తిన జండాను

ఎన్నడు దింపను
కన్నీరు వింపను
పన్నుగ సుద్దాల
వెన్నుదొచ్చినగావి ॥కత్తు॥

అమీన్

ఆఁ ఖబరు బాగానే ఉందే. అరె! యెవ్వరా? వీన్ని లోపలేసి మన బలం కొంచెం చూపిఁచుదాం.

నాగయ్యను చిత్రహింస చేస్తారు. నిశ్శబ్దంగా భరిస్తాడు. కొట్టి కొట్టి అమీన్ అలసిపోతాడు అదిచూసి

నాగయ్య పాట

అయ్యయో! పోలీసువారు
అలసి సొలసి పోతుంటిరా
చిమ్ముతున్న నెత్తురుచూసి
దమ్ము నాపుకొంటిరా ॥అయ్య॥

గోళ్ళలో సూదులను దించి
కిళ్ళ మిటకరింతురే
చెక్కుచెదరని నన్ను చూసి
దిక్కులొంక చూతురే ॥అయ్య॥

ఇనుప కాళ్ళతోని తొక్కిన
ఇనుమడించును పౌరుషం
చిత్రహింసలకు బెదరదు ప
విత్రమైనది ఆశయం ॥అయ్య॥

పిడికిలెత్తి పేదల జెండా
విడకెన్నడు వస్తినో

అన్నదే యీ హింసలన్నీ
ఉన్నయనెరా కవి సుద్దాల ॥అయ్య॥

నాగయ్య మూర్ఛపోతాడు

ఆమీన్

అరే ! వీన్ని తీసుకెల్లి అవుతల పడెయ్యుండ్రి

నాగయ్యను మోసుకు వెల్తారు

రాజాసాబ్‌ను కలవాలి. కల్లుకుశీ, పిల్లకుశీ లేక మస్తు రోజులాయె.

(సేత్‌సిందితో నిష్క్రమిస్తాడు)

తాగిన నిషాలో రామిరెడ్డి, అమీను ఉంటారు

అమీన్

రాజసాబ్ దావత్ అయింది గని ఒక మాంచి వడుచు పిల్లతోని కుశీ చేయించి పున్నెం కట్టుకోండ్రి.

రామిరెడ్డి

గదేం భాగ్యం. అరే ఎవడ్రా? చాకలిదాన్ని అరుసుకొని నిన్ననో ఇయ్యాల్లనో సముర్త అయిందాన్ని జల్దిన తోలుకరాండ్రి

అమీన్

అబ్బ ! అబ్బ ! శుకురియా ! నయా చోక్రీసే కుషామత్. బహుత్ శుకురియా

రామిరెడ్డి

నాగన్ని లెవ్వకుంట చేసిండ్రు గదా ! మీకేదంటే అదే మంజూర్

(నిష్క్రమిస్తారు)

## తెరలో ఉన్న రాధమ్మ పరిచయం

### పాట - సూత్రధారి

కదలెను తెరలోన- రాధా
కధ చిత్రము చాన
ఏ కాముకుని మోసపు ఫలితమొ
ఏ కన్నియ తొలి మోహపు ఫలితమొ
ఆకాశానికి తెలియును సత్యం
ఈ లోకానికి తెలియని చిత్రం ॥కద॥

పాపరూపమైన- వెన్నెల
దీపకాంతిమేన
ఆమె వదనము రాగబంధురం
ఆమె హృదయము దైవమందిరం
ప్రగతిని కోరే పవిత్రాశయ
జగతిని దొరకని ఉదాత్తశీల ॥కద॥

అమ్మా ! రాదమ్మా ! నీ చరిత్ర ఎంత దయనీయం తల్లి. నిన్ను గన్న ఈ పల్లె పవిత్రమైంది. నీకోసం మేమంతా వేయికళ్లతో ఎదురుచూస్తున్నాము తొందరగా రా తల్లి !

### రాధమ్మ ప్రవేశం - పాట

రాధమ్మ యని నాదుపేరమ్మ - శ్రీ
నాదు దొక్కటె నాకుతోడమ్మా
తల్లిదండ్రులు లేని దీనను నేనమ్మ
ఊళ్లోని వాళ్లంత అమ్మ నాన్నలునాకు ॥రాధ॥

ఏగంటి బిడ్డనో తెలియదు - నన్ను
ఏ తల్లి కన్నదో తెలియదు
కళ్లు తెరచింది నే నీ పల్లెలోనమ్మా
తల్లియై పెంచింది యీ పల్లెయేనమ్మా ॥రాధ॥

ఏ యింట పెళ్లైన నేనుందు - కోరి
ఆ యింటి పనియంత నాదందు
ఏకంట తడివున్న భరియించలేనమ్మ
ఏ చంటిపాపైన లాలింతునోయమ్మ ॥రాధ॥

ప్రగతమ్మ మాటంటే వేదము - నాకు
ప్రగతి మార్గమ్మంటే మోదము
పాటల కోకిల యందురు చెలులంత
పాటలు విని మెచ్చె సుద్దాల హనుమంతు॥రాధ॥

సూత్రధారి

అమ్మాయి రాధమ్మా ! ఎటు వెళ్తున్నావమ్మా ?

రాధమ్మ

మా ప్రగతమ్మ వాళ్ల నాగన్నను అమీన్‌సాబ్ బాగ కొట్టిండట చూడబోతున్న

సూత్రధారి

అవునట గదా. అయ్యో ! పాపం ! వెళ్లు తొందరగ.

(నిష్క్రమిస్తారు)

రామిరెడ్డి, అమీన్ పిల్లకోసం ఎదురుచూస్తుంటారు

అరే ! ఏమాయరా ? ఇంకా రాలేదురా బంట్లు శీఠిగా.

శీతయ్య

అగో ! అదేంది వత్తుండ్రు బాంచెన్

అమీన్

పని అమలయినాదిర ?

రామిరెడ్డి

రాజా రామిరెడ్డి దొర పని అమలు కాదులే!

రాధను బంట్లు నెట్టివేస్తే దొరకాళ్లపై పడుతుంది

రాధమ్మ

దొరా! మీ కాళ్లుమొక్కుత. నన్ను విడిచి పెట్టుండ్రి దొరా!

అమీన్

వహ క్యా మస్త్ హై సాలీ అందాజా నహీఁ కర్‌సక్తే మహరాజ్! కిత్‌నీ మషాలాహై ఇస్‌కీ నజరోమేఁ మజా ఆయెగీ....

రామిరెడ్డి

ఏందే! మా కాడ పంటె ఇన్నదైతావే? పిచ్చిముండ!

రాధమ్మ

దొరా! మీ పల్లె తెక్కనుకోండ్రి దొరా!

అమీన్

ఇంక నయం. తల్లి తెక్కనుకోండ్రి అంటలేదు. పట్టు పదే....

రామిరెడ్డి

ఏడవద్దే పిచ్చిదానా! నవ్వితె ఇసువంటప్పుడు....

పాట

రామిరెడ్డి

నవ్వితె రాలు
రవ్వలు వేలు
ఎవ్వతిరా ఈ పోరి - దీని
యవ్వ యెంత సుకుమారి ॥ఎవ్వ॥

అమీన్

సెహబాస్ !

చిందు వెయ్యవే
చాందుకి తుకుడా
అందగాడను గానా- శర్
మింద యేల చినవానా ? ॥అంద॥

రామిరెడ్డి

విరులు ముడువని
కురులు చెదరినను
సిరులు పొంగు ముఖబింబం - బల్
మరులు గొలుపు దీ నందం ॥సిరు॥

అమీన్

పూలశలాక !
మేలిమి తునక !
దిల్‌మే ఆగ్‌లగాయా - ఏక్
పల్‌మే ఖూన్ జలాయా ॥దిల్॥

రామిరెడ్డి

వహ్వా ! పసంద్‌కీ బాత్ !

తీరిక దొరకక
కోరిక తీరక
ఊరికె సాగెన్ రోజుల్ - ఈ
సారికి తీరును మోజుల్ ॥ఊర॥

అమీన్

పందెపు గుర్రపు
టందము దీనిది
తొందరేల మనకింక- ఇగో
ముందు మీరు నే వెనుక ॥తొంద॥

రామిరెడ్డి

చేతికి అందని
ఛాతి సంపదని
ప్రీతితోని అందించు- నవ
సీతమోలె కరిగించు ॥ప్రీతి॥

అమీన్

పహలే ఆప్

రామిరెడ్డి

ఠీక్ హై! బాద్‌మె ఏక్ తమాషా దిఖావుంగా

అమీన్

సమఝ్‌గయా మహరాజ్. బట్టలు దీసెయ్యాల, బతుకమ్మ ఆడించాల,

తెర దించి ఎత్తిన తర్వాత

రాధ - పాట

ఈదేశమేనా - ఋషులను గన్న
దీరాజ్యమేనా ?
భరతాంబను బట్టి చెరలోబెట్టిర తెల్ల
దొరల దిన మికనైనపోదా ?
తెల్లదొరల తొత్తునై జాము సర్కారు
చెల్లిపోయే గడియరాదా ?
పోలీసు రాజ్యాన దొరల అన్యాయాలు
కాలిపోయే రాత లేదా ?
పడుచు బిడ్డలనెల్ల పాపాత్ములు గూడి
చెరగొడుతె ఎంతటి బాధ! ॥ఈదే॥

ఏదమ్మ తల్లీ - భారత శౌర్య
మెటువోయె తల్లీ ?
మట్టిబొమ్మల్లాంటి మగవారి ముందు నను
పట్టి బంధించారోయమ్మా !
ధీరులను గన్నట్టి నీ కడుపులో ఏల
భీరువులు జన్మించి రమ్మా ?
పరశురాముని లోని పౌరుషమ్మీనాడు
పిరికిబావిల పడినదమ్మా
మానాలు కాపాడు కన్నయ్య లీనాడు
లేక ఎంతటి పాపమమ్మా ॥ఈదే॥

తెలుగమ్మ చూడే - నా బతుకింక
తెలవారె నేడే
తల్లిదండ్రులు లేని అన్నదమ్ములు లేని
చెల్లెనని బతిమాలుకుంటి
మీ తల్లులు లేరా ? మీ చెల్లెలు లేదా
ఏ తల్లి యిది మెచ్చదంటి
అన్నన్న ! యిది యెంతో అన్యాయమని నేను
కన్నీళ్లతో మొక్కుకుంటి
చీరెలు దీయించి బతుకమ్మ లాడించి
శీలమ్ము దోచవద్దంటి ॥తెలు॥

(నిష్క్రమిస్తుంది)

నాగయ్య ఇల్లు

నాగయ్య గాయాల నుంచి కోలుకుంటాడు.
పరామర్శించడానికి జనం వస్తారు.

## రైతు

ఎంత గోరం జరిగింది నాగన్నా! అబ్బో! సచ్చిపోతుంటివి గదా!

## నాగయ్య

దెబ్బలకు లొంగి హింసలకు కుంగి బెదిరిపోయేవాడు నాయకుడు కాడు. మామా పోరాట మంటె కత్తిమీది నడక. అందుకే కవి సుద్దాల ఒక పాట రాసినట్టు జ్ఞాపకం.

## రైతు

ఇనిపించండ్రి బాబు

## నాగయ్య

ప్రగతీ! దాని పల్లవి ఏమో వుండెనమ్మ?

## ప్రగతి

ఆఁ! ఆఁ! ఆఁ! "కట్టుగానుగలోలె"

## నాగయ్య - పాట

కట్టు గానుగలోలె పుట్టుదావిసలోలె
గతిలేక మతిలేక బతికే పీనుగలోలె
మనలేదు పోరాడే ధీరుడు - వాడు
బలిదైన తిరిగొచ్చే సూరీడు ॥మన॥

తల్లిదండ్రుల కన్న అన్నదమ్ములకన్న
ఎదలోని ఎదవోలె ఒదిగేటి చెలికన్న
అత్యుత్తమము నీదు దేశం - బతుకు
నిత్యమ్ము దానికై అంకితం ॥అత్య॥

ఏ నేల పుట్టితిమో ఏ గాలి పీల్చితిమో
ఏ జనముతో మనము ఇన్నేళ్లు బతికితిమో
అందుకై రక్తాన్ని చిందించు- నువ్వు
మందే నెత్తుటి దివ్వె యనిపించు ॥ఆదు॥

అడుగడుగునా ఎన్ని పిడిబాకు లున్నను
కుడి యెడుమ నిను ముంచె సుడిగుండాలున్నను
కళ్లల్లో నీళ్లింకి పోవాల - మనది
తల్లడిల్లని గుండె కావాల ॥కళ్ల॥

రైతు

మంచి మాట చెప్పినవు నాగన్నా! అప్పుడుగని ప్రగతమ్మా! గీ గోరం యిన్నావా?

ప్రగతి

ఏంటిది మామా?

రైతు

పాపం రాధమ్మను దొర, ఆమీన్‌గాడు కరాబు జేసింద్రట!

ప్రగతి

ఛీఛీ! మన మగవాళ్లంతా చచ్చారా? అయ్యయ్యో!

రైతు

మనోళ్లంతా మీటింగుకు పోయింద్రు. ఉన్న ముండకొడుకులు గాజులు తొడుక్కున్నరు.

భీమయ్య ప్రవేశించి

ప్రగతీ! ఇదిగో రాధమ్మ బాయిల బడ్డది జెర్రల ప్రాణం పోతుండె. నేను దేవుడు తోలేసినట్టు గప్పుడే అట్ల వస్తున్న

రాధ

అక్కా !

ప్రగతిపైబడి ఏడుస్తుంది

ప్రగతి

రాధా ! ఎంత ఘోరం జరిగింది తల్లీ !

రాధ

ఇగ నేనెట్ల బతుకాలక్కా. నా బతుకే నాశనమైంది.

సంవాదం - పాట

మనవి వినవమ్మ - నను మన్నించమ్మ
నే బతుకనమ్మ ॥నను॥
వనితకు ప్రాణముకన్న మానమే
ఘనమని వచియింతురుగదనమ్మ

ప్రగతి

చెలియ! వినవమ్మ - శీలం చెడదమ్మ
బలి కావద్దమ్మ ॥శీల॥
బలిమిని ని తనువును చెరచిన ఫలి
తమ్ముగ నువు మలినవు గావమ్మ

రాధ

వేగించలేను - ఈ బతుకు వింత
సాగించలేను ॥ఈబ॥
ఏ గతి లేనటువంటి నేను ఒక
మూగ జీవితము గడపడ మెందుకు?

ప్రగతి

మూగబ్రతుకుల - భగభగ మండాల
పగరేగి చాల ॥భగ॥
జాగు చేయకను చండికవై చెల
రేగవె శత్రుల నెత్తుక తాగగ

ప్రతీకారం కోసం బ్రతుకు. ప్రతినచేసి దొరతనాన్ని నిర్మూలనం చేసే సంఘంలో దుముకు.

రాధ

అమ్మా ! నేను సంఘానికి పనికొస్తానా ?

ప్రగతి

నీలో ఉన్న కళంకమేంటి రాధ? నీకంటే ధగాపడిన చెల్లెళ్లకోసం తమ్ముళ్లకోసం మనం జెండా యెత్తాల.

(నిష్క్రమిస్తారు)

దొర గడి

(రామిరెడ్డి చిన్నబోయిన ముఖంతో ఉంటాడు.
స్వామిరావు వస్తాడు

స్వామిరావు

దొరవారికి దండాలు

రామిరెడ్డి

దండం దండం

స్వామిరావు

ఏమిటో? రామిరెడ్డి జాగీర్దారుల మోములో ఆషాఢమేఘాలు....

రామిరెడ్డి

ంలేదు. మనసు బాగ లేదంతే

స్వామిరావు

దే ! ఎందుకా అని.... మీరిలా వుంటే నేను చూడగలనా దొరవారు ?

సంవాదం - పాట

స్వామిరావు

వెన్నెల దొర మీరు - చిన్నబోయినారు
ఎన్నడు ఊహించలేదు - మున్నెన్నడు చూడలేదు
తళతళ మెరిసే మోము - మలమల మాడినదేమి ?
గలగల నవ్వే కళ్లు-వెలవెల బోయినవేమి ? ॥వెన్నె॥

రామిరెడ్డి

కరణం ఇక నేను - మరుగుపరచలేను
కలిగె చింత ఒకటి అది - కలవరపరచే చీకటి
గంటల లోపల దీన్ని - మంటల గలుపకపోతే
తింటే ముద్దబోదు - పంటే కునుకురాదు ॥కర॥

స్వామిరావు

భూస్వాముల బాధ - ఈ స్వామిది కాద ?
రేపటి లోపలను - రూపు మాపగలను
బెట్టు చెయ్యక మీరు - గుట్టు విప్పండయ్య
ఎట్టి ఆపదైన - మట్టుబెట్టించెద ॥భూస్వా॥

రామిరెడ్డి

తరతరాలుగానూ - దొరభోగంలోనూ
అనవాయితీగా - అనుభవించుమమ్మ

సాగనివ్వనంటూ - రేగి పోతున్నాడు
నాగడు నాపాలి - నాగుబామయ్యాడు ॥తర॥

స్వామిరావు

ఓహో! వాడేనా? అయ్యా! వాడి చిట్టా ఎప్పుడో రాసి పెట్టా. మీరు అనే దాక ఓపికపట్టా అం. మన మాదిగవాడలో ఈ నాగన్ని గుటుక్కు మనిపించేవాడు ఒకడున్నాడు చూశారా?

రామిరెడ్డి

ఎవడయ్యా అంతటి ఘనుడు?

స్వామిరావు

కలడు నారిగాడు - ఖలుడు మహాబలుడు
కల్లుముంత చూసి - ఒళ్లు మరవగలడు
చిత్తుగ తాగించి - మత్తులోన ముంచి
మెత్త పరచామంటె - కత్తి గుచ్చివచ్చు ॥కల॥

రామిరెడ్డి

అబ్బ! ఎంత చల్లని మాట చెప్పావయ్యా!

స్వామిరావు

అయ్యా! నేను మీ కరణాన్ని. అంతో యింతో దొరకింద దొరను. ఇలాంటివి ఎన్ని చేయించలేదు? మనదేదైనా సామ దాన భేద.... చూసి దండమే కదా ఉపయోగిస్తాం.

రామిరెడ్డి

శభాష్!

సంతోషము కలిగె - సంతాపము తొలగె
స్నేహితుడవు నువ్వు - నా హితుడవు నువ్వు

**విడిపోను సీతోడు - ఎడబాయనీ జోడు**
**పుడమిలో** సుద్దాల - గుడిగోపురము **తోడు ॥సంతో॥**
(నిష్క్రమిస్తారు)

సూత్రధారి

అదిగో ! ఎవరో యిటే వస్తున్నారు. ఓహో హరిజనుల జంట ఉన్నట్టుంది. ఆఁ! అంతే ! నారిగాడు వాని పెళ్లం.... పేరేందో ? సరే రానీ వాళ్లే తమ బాగోత మంతా బట్టబయలు చేస్తారులే.

**నారిగాడు** లచ్చి సరాసరి జనంలోంచి వేదిక **మీదికి** వస్తారు
(సూత్రధారి నిష్క్రమిస్తాడు)

పాట

నారిగాడు

నారిగాన్నయ్యా
**ఈ వూరికి తూర్పున బతికే మాదిగ** ॥నారి॥
**కరువుల పల్లెల మురికివాడల**
**బరువుల బతుకుల పూరిగుడెసల**
గరీబోల్లమను గలీజోల్లమను
**పిరికి జాతిలో పుట్టితి నయ్యా** ॥నారి॥

లచ్చి

లచ్చి నాపేరు
**నే మెచ్చబోను మా మనుషులతీరు ॥లచ్చి॥**
**నచ్చజెప్పినా తాగుడు మానరు**
**మెచ్చుకోలు పని ఒక్కటి చెయ్యరు**
**తచ్చు జాతి యను మాట విడువరు**
**రొచ్చుగుంటలో మురుగుచుందురు ॥లచ్చి॥**

## నారిగాడు

కల్లు తాగద్దంటున్నావే లచ్చి ! నీయవ్వ !

కల్లు తాగేదీ
మా తండ్రుల తాతల నుంచి ఉన్నది ॥కల్లు॥
ఒళ్లు వంచి పని చేద్దుముగాని
ఒళ్లలోన ఒక యిత్తు ఉండది
పెళ్లాం పిల్లలు రద్ది చేసిన
తెల్లారదు మా చేసిన కష్టము ॥కల్లు॥

## లచ్చి

ఎంత చెప్పినా అంతే

తరుగులేదయ్యో
నే సెరిగి పోసినా పెరిగే చెత్తకు ॥తరు॥
హరిజనులారా ! మారిపోండనీ
పురజనులంతా సమానమేనవి
పరిశుభ్రతనూ పాటించాలవి
అరచిన వినరే తాత చెప్పినా ॥తరు॥

## నారిగాడు

ఈ లచ్చి పట్నంల పుట్టింది. ఊర్లల్ల కతలు ఏమెరుక చెప్పుండ్రి ?

ఎట్టి బతుకులు
మన పట్టనపోల్లు మస్తు జెప్పుతరు ॥ఎట్టి॥
ఎట్టికి మావితె దొరలు గొట్టుతరు
మొట్టమొదటికే తీరిక ఉండదు
పుటుకల నుంచే మట్టి బతుకులు
ఏటికి మాకు టీకుటాకులు ॥ఎట్టి॥

లచ్చి

ముందు చూడాలి
ఇంకెందుకు మనకు వెనుక సంగతులు ॥ముందు॥
సంగపోల్లు ఏమంట వున్నరు
సంగమయ్యి బతుకాలంటున్నరు
లంగ తిరుగుడులు మానుమన్నరు
లొంగి బతుకుడే సావంటున్నరు ॥ముందు॥

నారిగాడు

ఐతే నీ సోది. ఎప్పుడున్నదే గని నువ్వియల్ల యాడికి పోతున్నవే

లచ్చి

దొరోల్ల పొలాలకు పోతున్న. మరి నువ్వు?

నారిగాడు

పటవారి పొలాల గొర్రుగొట్టాలె.

లచ్చి

అగని! బాగా తాగి రాకు. నీ పున్యం.

నారిగాడు

యవ్వ పొద్దాక చేసి తాగద్దంటావే

లచ్చి

కష్టమంతా కల్లుకే పోతే పిల్లలకు ఎట్లాని?

నారిగాడు

ఏది దొంచి దానికే అయితుంది.

లచ్చి

ఇది కొత్తగనా ? నువ్వు ఏంతజెప్పినా యింటవా ? సరే ఎల్లిరా

(నిష్క్రమిస్తారు)

నారిగాడు తాగి వస్తాడు

నారిగాడు

లచ్చీ ! నా ముత్యాల పండు ! నా తెల్ల మల్లెపూల చెండు ! ఉన్నావే

లచ్చి

ఏంది బావ ? మల్లా బాగా పేసుకొనే వచ్చినవా ? నా ఖర్మ.

నారిగాడు

నీ యవ్వ ! నువ్వేమన్న అనుగని ముగ్గురు పుట్టినా నువ్వయితే నీయవ్వ ! బెల్లమ్ముక్క లెక్క కమ్మగున్నవే.

లచ్చి

ఏపో ! వూరోక్క సిగ్గులేదు.

నారిగాడు

సీయవ్వ ! సిగ్గెందుకే. నేను నీ మొగన్ని. నువ్వూ.... నా సక్కదనాల సిలుకవి

లచ్చి

చాల్ తియ్

నారిగాడు

తియ్యమంటవు. నేనే మన్న పెట్టినానె.... చెయ్యి నీ మీద ?

లచ్చి

ంతే నువ్వేమంటవో నీకే తెలవద్దు.

నారిగాడు

గుడు తాగుడు. తాగితేందే? నీయవ్వ.

సంవాదం - పాట

లచ్చి

తాగరాదు - తాగుడులోన
బాగులేదు
తాగి విరుపేదలు - ఆగమైపోతుండ్రు ॥తాగ॥

నారిగాడు

కల్లు సార - కడుపార తాగి
యిల్లు చేర
పిల్లా! నాకు సోర - పిల్లోలె గోడుతావె ॥కల్లు॥

లచ్చి

ట్లనె టందుకు సిగ్గన్న లేదాయె.

ఒకటే కోక - ఉన్నది నాకు
ఒకటే రైక
తాగిన విషలోన - వాగుచుంటివి నువ్వు ॥ఒక॥

నారిగాడు

ఎక్వతక్వనకు. నన్నేం జెయ్యమంటవ్? ఒక శీరుంటే. నాకేమన్నా వరకట్న మిచ్చింండ్రా మీవోల్లు.

భూమిలేదు - మీ అయ్యిచ్చిం
దేమీ లేదు
ఎంత పంజేసిన - ముంతకల్లురాదు ॥భూమి॥

లచ్చి

నువ్వు కల్లుకు చూడు. మన పిల్లలేమొ

అవ్వోయవ్వా - అని పిల్లలు
బువ్వతేడ్వ
కన్నతల్లివి నేను - ఎన్నవి బొంకను ॥అవ్వో॥

నారిగాడు

కలుపు తీసి - తెచ్చినదేందా
తెలుపు లచ్చి!
నాకల్లు బంజేసి - నూకలు తేవాల్నా ? ॥కలు॥

లచ్చి

కలుపు కూలే - పిల్లల పానం
నిలిపే తల్లి
పిలు నీ పిల్లలకు - ఒకపూట గంజైన ॥కలు॥

నారిగాడు

ఎన్నన్నగాని లచ్చి! నాకెక్కువ తెలువది గని

మానలేను - అపైన లిచ్చే
వాన్ని గాను
తాగకుండా నేను - గడియ బతుకలేను ॥మాన॥

లచ్చి

నరేలే! బావా! నా మాట ఎప్పటికైనా గుర్తుంటదిలే ఎందుకు తాగద్దంటున్ననో

ఎన్నడైనా - తెలియునులే నే
నున్నా పోయినా
చేతులు కాలాక - ఆకులు బట్టాకు ॥ఎన్న॥

## నారిగాడు

ఆయితాయెగాని లచ్చి! ఏం కూరనే?

## లచ్చి

గా నర్సి పచ్చి చాపలు పెట్టింది. చింతపండు పులుసు లేసిన

## నారిగాడు

ఒర్నియవ్వ! నువ్వెంతయినా తల్లసుంటిదానివే.... నా బంగారు లచ్చి!

## తెరలో నుంచి శీతయ్య

అరే! నారిగా! ఉన్నావుర యింట్ల?

## నారిగాడు

ఆఁ. వున్న. ఎవల్లు? నువ్వా శీతన్నా! రా!

## శీతయ్య

గఁ! నారిగా! దొర నిన్ను రేపు గడీలకు రమ్మన్నడ్రా

## నారిగాడు

మంచిది. ఏమ్ముచ్చటో జెర్రంత శెవునెయ్యక పోతివి

## శీతయ్య

ఏమోరా! పెద్దోల్లు అవన్ని చెప్పుతారు? తప్పక రారో

## నారిగాడు

అమ్మో! దొర చెప్పి పంపినంక రాక బత్తాను వస్తా.

(నిష్క్రమిస్తారు)

దొర గడి

రామిరెడ్డి

ఎవర్రా అక్కడ?

సీతయ్య

దండం దొర!

రామిరెడ్డి

నారిగాన్ని రమ్మన్నని చెప్పినావుర?

సీతయ్య

నిన్ననే చెప్పిన బాంచెన్. అగో! వస్తనే వున్నడు.

(నిష్క్రమిస్తాడు)

నారిగాడు

దండాలు దొర!

రామిరెడ్డి

ఆఁ నారిగా! వస్తివా. అట్ల కూచోబిడ్డ. ఈ మధ్యన పూర్తిగా నల్లపూస ఐతి వేందిరా?

నారిగాడు

ఊల్లెనే వుంటున్న దొరా! సంగతేందో చెప్పుండ్రి కాల్మొక్త!

సంవాదం - పాట

నారిగాడు

తెలుపుడీ! నను బిలిచిన పనియేమొ
తెలుపుడీ

కలల సైతము మీదు ఆజ్ఞల
మెంగువాడను ఎప్పటికి నా
వలన అయ్యే పని యదేమో
సెల వొసంగిన చేతు విప్పుడె ॥తెలు॥

రామిరెడ్డి

నారిగా - వినరా నాదు మాట
నారిగా ।
ఓరి నీతో పెద్ద పనిబడి
దారి గాచుక నుంటి విప్పుడు
రారః నీవా పని యొనర్చిన
కోరినంత ధనం బొసంగెద ॥నారి॥

నారిగాడు

దొరగారూ - నమ్మది నాదుమాట
దొరగారు ।
మరుగు పరచగనేల సంగతి
త్వరగ తెలుపుడి సంశయించక
ధరణిలో విరుపేదనయ్యి
దొరల పని చేయుటకె పుట్టితి ॥దొర॥

రామిరెడ్డి

వినుమిక - తెలిపెద నది కాదనక
వినుమిక
కనుల గానక సెన్నెదిర్చగ
బూనె నొక మనుజాధముడు వా
విని వధించగ వలయు అన్యుల
కనుల కగుపడకుండ నీవే ॥విను॥

నారిగాడు

ఏవరయ్యా - అంతటి దుర్మార్గుడు వా
డెవరయ్యా ?
ఎవరు వాడే కులమువాడు ?
ఏమి యపచారం బొనర్చెను ?
వాని జంపు మనంగనే అను
మానమయ్యేను నాదు మదికి ॥ఎవ॥

రామిరెడ్డి

ఎరుగవా - నాగయ్య రైతు నాయకుని నీ
వెరుగవా ?
దొరల జాగీర్దా ర్విధానము
రద్దురద్దని తిరిగి మొరుగుచు
పురజనమ్ముల గూడి నాపై
తిరగు బాటొనరించు వానివి ॥ఎరు॥

నారిగాడు

హరి హరీ - ఎంతటి మాటాడితిరయ్యా
హరిహరీ !
పరగ శ్రమజీవులకు తిండీ
బట్ట కల్పించేటి నాగయ
నరయకనె వధియించుమన నో
రాడె నెట్టుల మీకు శివ శివ ! ॥హరి॥

రామిరెడ్డి

పిచ్చోడా - ఎరుగవు నాగయ్యెట్టివాడో
పిచ్చోడా !

తుచ్ఛుడని నాగయ్య నెంచక
హెచ్చుగా పొగడెదవు నీవా
పిచ్చి వదలి నేడె బాకున
గుచ్చిరారా మాన్యమిచ్చెద ॥పిచ్చి॥

నారిగాడు

వద్దయ్యా - మీ మడులు మాన్యాలు నా
కొద్దయ్యా!
వద్దు వద్దొక న్యాయపరుని వ
ధించి మీకడ బహుమతులు గొని
వృద్ధి నొందుట కన్న మేలగ
పొద్దు గడిపెద బిచ్చమెత్తి ॥వద్ద॥

రామిరెడ్డి

తెలిసెరా - పంచముడా! నీ సంగతంత
తెలిసెరా
పలువ లందరు గూడి గవ్వకు
పనికి రానటువంటి సంఘము
నిలిపి ప్రజలకు నాయకుల మని
కులికె వారిలొ నీ వొకడవని ॥తెలి॥

ఏమిరా? నేను కన్ను తెరిస్తే ఎక్కడుంటార్రా మీరంత? మాదర్చోద్ మసిమసి చేస్తా. నాకే ఎదురు చెప్తావురా!

నారిగాడు

దొరా! సచ్చేదాక మీ యింటి కుక్కోలె వుండమన్నా వుంట గని ఆ నాగయ్యను మాత్రం....

## సంవాదం - పాట

పొడిచి చంపలేను బాంచెన్
పుణ్యమూర్తివి ఓ దొర!
పొడిచి చంపుమని ఎంత చెప్పినా
పాడు పని తలపోయ పాపము! ॥పొడి॥

### రామిరెడ్డి

నారిగా! ఎరుంగలేవు
నాగయ పొగరు ఒరే!
పొరులెదుట చిన్న పెద్ద
పాటించక నన్ను వాడు
దూరభారము లేక- తూలనాడినాడు
ఏరికైన నను వావి- గోరి గట్టించెద ॥నారి॥

### నారిగాడు

కూలిరైతు బిడ్డలాకు
కూడు కలిగించగ ఓ దొర!
చాల శ్రమపడి రైతు కూలి
సంఘము విలబెట్టె నాతవి ॥పొడి॥

### రామిరెడ్డి

రైతులందరికి నేనే
రాజును వినరా ఒరే!
పాత గుడ్డి గవ్వకైన
పనికిరారు నా యెదుట
రైతు సంఘం బెట్టి- రక్షించు మొనగాడ?
కూలి సంఘ-బెట్టి- కాపాడు నాయకుడ?॥రైతు॥

### నారిగాడు

సొంతలాభం కోరని గుణ
వంతు డాతండు ఓ దొర!
పంతమూని అతవిని చంపుట
పాడి కాదయ మీకు నేడు ॥పొడి॥

### రామిరెడ్డి

నాకు నీతి చెప్పెదవా?
నారిగ నీవు ఓరే!
పోకిరి వెధవా! నాగయ
పోతదలే మంచివనుచు
నాకడ చెప్పకు మింక - నాగవి హత్యకు ముందే
చీకటి గదిలోకీడ్చి - చీల్చి బొందబెడుత ॥నాకు॥

### ఇంతలో స్వామిరావు ప్రవేశించి

ండి ఆగండి ఏమిటి ఆ తొందర?

### రామిరెడ్డి

కు జరగండి వీన్ని నరికివేస్తేగాని నా కసి తీరదు. గాడిదికొడుకు నా మాటకు
పరుజె ప్తడా?

### స్వామిరావు

రాగండి దొర! ఒరే నారిగా! మా యింటికాడ పంతులమ్మ కట్టెలు గావా
ష్లది. మోపెడు గొట్టెయ్ జల్ది పో. నేను వస్తా. వచ్చేదాక వుండు.

### నారిగాడు

ంచిది బాంచెన్.

(నిష్క్రమిస్తాడు)

## రామిరెడ్డి

అసలు ఈ దరిద్రపు ముండాకొడుకు లందరు ఆ నాగన్ని చూసుకునే సీల్గు తున్నరురే. ఒక్కొక్కన్ని....

## స్వామిరావు

ఏమిటా తొందర? అయినా నేనున్నానా జరిపించేవాన్ని. అవునూ కొడితే తిడితే పని అవుతుందా? చెప్పండి? మూడు రోజులాగండి. నారిగాన్ని సారాలో దించి ఎన్ని తీర్ల చెయ్యాల్నో అన్ని తీర్లచేసి వానితోని ఎట్ల పని ఖతం చేపిస్తానో చూడండి.

## రామిరెడ్డి

నాగన్ని ఖతం జేపిస్తవా శెభాస్!

(నిష్క్రమిస్తారు)

## కరణం ఇంట్లో మూడు రోజులుగా విపరీతంగా తాగి మారిపోయిన నారిగాడు

నీ యవ్వ దొరల్ల తిరుగాల. దొరల్ల పండాల. గీ సంగంల ఏముందిర? మన్ను దుబ్బ....

## పాట

అప్పజెప్పిండు దొర సారజాడి
సెప్పలేవింక మస్సాల కోడి
ఇంత యింతైన యిసికీబు బ్రాంది
తంతె నోరగంల పడినట్టుగుంది ॥అప్ప॥

దొర యాద నేనాద శిత్తుకం
సార నాలోని తాగె లోకోత్రం

కడిగె కరణాముఎంగిలి కంచం
అడుగ కేసిండు పరుపున్న మంచం ॥దొర॥

ఇచ్చె గుమగుమల సిగిరేటు నాకు
తెచ్చె దొరసాన్లు తిను తమలపాకు
నారి గాదని పిలిశేది మునుపు
నారి గారంటు దొర పిలిశె నునుపు ॥ఇచ్చె॥

దొర తోని వుండెడ్డి బోగం
పోరి వారేవ నాతోని ఘుం ఘుం
దొరదోస్తి చెయ్యాలి రోరి
దొర కింద దొరలౌదుము రోరి ॥దొర॥

దొరలు కరణాలు మనకు దేవుండ్లు
వరము లిచ్చిండ్రు దొరకు దేవుండ్లు
లేవివాళ్లంత దొరల సేవకులు
నేను తెలుసున్న దొరలె పాలకులు ॥దొర॥

లొంగి తిరుగాలె దొరకు ఇయ్యాల
లంగ సంగాలు మనకింక యేల ?
కాపు నాగవ్వి నేను లెక్కించ
రేపు తెల్లారె వరకు వాన్నుంచ ॥లొంగి॥

వాడి నెత్తుర్తో దొరపాదములు
కడిగి గడియింతు పది యెకురములు
మారిపోతుంది నా జాతకమ్ము
దొరకు నాకింక తెగని బంధమ్ము ॥వాడి॥



రాత్రిపూట ఒంటరిగా వస్తున్న నాగయ్య డొక్కలో కత్తి దించి నారిగాడు పారిపోతాడు. 'అమ్మా' అన్న కేక విన్న జనం నాగయ్యను ఇల్లు చేరుస్తారు. తల్లిదండ్రులు తమ్ములు చెల్లెలు మీదపడి ఏడుస్తారు. మరణ సందేశమిస్తాడు నాగయ్య

పాట

కన్నీరు వలదు - అన్నె లేదని మీరు
ఆగిపోవలదు
ఆశయాలకు ప్రాణ మాహుతి యగువేళ
ఆరిపోరాదు మీ కర్తవ్య దీపాలు ॥కన్నీ॥

తలిదండ్రులారా - తనయుని కొరకు
తల్లడిల్లేరా
ప్రజల కోసము నేను ప్రాణ మర్పించాను
ప్రాణమ్ముగా మీలో పదిలంగ ఉంటాను ॥తల్లి॥

నా తమ్ములారా - నన్నుగని వగచేటి
నా మిత్రులారా !
నా మీద నిజమైన ప్రేమఉంటె మీరంత
నాగన్నలై పోరు నడిపించ వలెనయ్య ॥నాత॥

నా చెల్లి ప్రగతీ - ఇక అందరివలె నీవు
పడరాదు భీతి
రుద్రమ్మవలె నిన్ను పెంచినానోయమ్మ
భద్రమ్మ మన ఉద్యమమ్ము అపొద్దమ్మ ॥నాచె॥

నను జంపినోడు - నారిగాడనెటోడు
వాడు హరిజనుడు
నారయ్యను మీకు ఏమి యనరాదయ్య
దొరగారె అసలైన వర్గశత్రువు మనకు ॥నను॥

సెలవిందు నాకు - చెల్లీ ! ఇక తీయవె
దొక్కలో బాకు
ప్రాణాలు వదలెద తల్లీ ! నీ ఒడిలోన
ధీరవై జీవించు దీవెన లివె నీకు ॥సెల॥

నాగయ్య కన్ను మూస్తాడు. తల్లిదండ్రులు చెల్లె తమ్ములు,
రైతులు దుఃఖిస్తారు

అన్నపూర్ణ - కందార్థం

నాగన్నా ! నాగన్నా !
నాగీ ! అమ్మా యటంచు నను పిలువుమురా
మూగ వ్రతమేల తండ్రీ ?
ఈ గతి పగబూన విన్ను
ఏమనంటివిరా - ఆ కనులేల
మూసుకొంటివిరా - నీకు వేది
అన్నం గావలెనా - నీకు మీగడ
పెరుగేయవలెనా - నీకు నేనే
కలిపింతు కొడుకా - నీకు నేనే
తినిపింతు కొడుకా !
అలిగి పంటివ కొడుక
అన్నము తినకుండ
నీవు తిన కుండిన
నే గూడ తిననయ్యో
ఏమనంటివిరా - ఆ కనులేల
మూసుకొంటివిరా ?

## హనుమయ్య - కందార్థం

నా కొడుకా ! క్షణమింటను
లేకున్న ప్రశాంతి నాకు లేకుండెనురా
నా కన్నులలో వెలుగులు
నీ కమ్మని మాట వినక
విలువవు కొడుకా - నువు లేనింట్ల
నేనెట్లు బతుకా - నీతో మాకు
వెలుగొచ్చెనయ్యా - నీతో ఎంతో
పేరొచ్చెనయ్యా - ఒక రోజె నువు
కనిపించకుంటే - నా కన్నులు
దరువాజ దిక్కే
మీ అమ్మ అది చూసి
నను ద్రోణాచారంటు
పలికేను ప్రతిరోజు
విలువవు ప్రాణాలు
నువు లేక కొడుకా - నవు లేవింట్ల
నేనెట్లు బతుకా ?

## ప్రగతి - కందార్థం

అన్న ! కనుమూసితివ ? నా
కన్నుల నొక నీటిచుక్క కారుటలేదే
చిన్నారి చెల్లెలివి నా
గన్నా ! దయలేని దనుచు
అనగ బోతుమురా - నా మనసేల
బండ బారెనురా - నాగన్నా ! నీ
చెల్లిని కాదా ? నాలో కన్నీ
రింకి పోయిందా ? అన్నా ! నేను

కట్టెనైతివిరా - కన్నుల్లో ఈ
మంట లేమిటిరా
గుండె కగ్గి తగిలె నేమొ
కండ్లపాపలు కాలె నేమొ
శూన్యమే యిక ఆవరించె
మౌనఘోషనె దాపురించె
విన్ను బెంచిన ఫలితమేమని
అనగబోకుమురా- నా మనవేల
బండబారెనురా

## రైతులు - కందార్థము

ఏ రోజును మము మరవని
కారుణ్యమ్మున్నవాడ కనుమూసితివా ?
ఈ రీతిగ నిను జేసిన
వారివి ఏ తీరుగైన
వధియింతుమయ్యా - ఇది అందరి
శపథమో యయ్యా - అందాక నువు
విదురించవయ్యా - ఆ దొరవెట్టి
చేయబోమయ్యా - ఆగడి నేల
మట్టమ్ము జేస్తాం - ఆ దొరగాని
ప్రాణాలు దీస్తాం
కండ కండలు చేసి
కాకులకు వేస్తాము
నిను గన్న సుద్దాల
కనులెర్రబడి చెప్పె
వధియింతుమయ్యా - దొరను ఇదే
శపథమో యయ్యా !

## ప్రగతి - కందార్థం

స్పందించిన నీ రక్తము
చిందెనురా యిదిగో చీర జేగురువారన్
చిందింతును దొర రక్తము
అందాక నేను అరుణ
వస్త్రమ్మె కడుదు - దొరలమీద
పంతమ్ము గడుదు - మరిగే గుండె
మాట తప్పదు - దొర బ్రతుకొక్క
యేడు తిరుగదు - అరుణోదయము
కాక ఊకోదు - తిరుగబడితె
ఎదురేదీ రాదు
ఊరంతా ఒకటి చేసి
దొర పెత్తనము త్రోసి
దొర నెత్తురును పోసి
నీ స్థూపమును గడుత
అందాక నే నరుణ
వస్త్రమ్మె కడుదు - దొరలమీద
పంతమ్ము గడుదు

(నిష్క్రమిస్తారు)

ప్రగతి నిరాశగా కూర్చొని ఉంటుంది
తండ్రి హనుమయ్య వస్తాడు

### హనుమయ్య

అమ్మా ప్రగతీ ! ఒంటరిగ కూసున్నవు తల్లి !

### ప్రగతి

ఏం మిగిలింది నానా

హనుమయ్య

ఎందుకు తల్లి ?

ప్రగతి

అన్నతోనే అంతాపోయింది నాన !

హనుమయ్య

అమ్మా ! ఇదేనా నీకన్న నేర్పింది ?

ప్రగతి

ఏమో నాన్నా ! నాకెట్లు చూసినా శూన్యమే అనిపిస్తుంది.

హనుమయ్య

అమ్మా ! తప్పు తల్లి. అన్నను కదిలించింది, ఈ నాన్నకు బోధించింది నీవేనా తల్లీ ? జనమే ప్రాణం అన్న నువ్వు కర్తవ్యం మరచిపోయి యింత పిరికి దానివై పోతావనుకోలేదమ్మా ! దుఃఖం క్షణికం. నీకు తర్వాత అన్న కావచ్చు గాని నాకు మొదలు కడుపున బుట్టిన కొడుకు కదా ! నాకు వాడు తలకొరవి పెట్టేది పోయి నేను వానికి తలకొరివి బెట్టవలసివచ్చింది. నేనెంత ఏడువాలి ? అన్న ఆత్మ శాంతించాలంటే ఆయన చేపట్టిన ఉద్యమాన్ని నడిపించాలి. వద్దు ఏడువద్దు.

ప్రగతి

ఎంత గొప్పవారు నాన్నా మీరు. కురుక్షేత్రం మధ్యలో పార్థునికి బోధించిన శ్రీ కృష్ణ హృదయం మీలో ఈనాడు చూశాను. చిన్నప్పటినుంచి చూసిన నాన్న కారు మీరు. ఇప్పుడు మీలో ఒక ఆరని విప్లవజ్యోతి వెలుగుతుంది. నిజమే ! అన్న ఉద్యమాన్ని తప్పక సాగిస్తాను. వర్గశత్రువైన దొరకు దుర్గతిని ప్రారంభిస్తాను. జనమే ప్రాణం. ప్రాణమే జనం.

హనుమయ్య

శెబాస్ ప్రగతి ! ప్రగతి అని నీ అన్న పెట్టినపేరు ఈనాడు సార్థకమైంది. అన్న బతుకు బలియైనా ఇంకా కొన్ని బతుకులు ఏమైనా మనవేద్దం సమభావాద్దం, మన లక్ష్యం స్వాతంత్ర్యం ! విజయం తథ్యం !

(నిష్క్రమిస్తారు)

**నాగయ్య ఇంటికి రైతులు ఆవేశపూరితులై వస్తారు భీమయ్య, కృష్ణయ్య, ప్రగతి అక్కడ ఉంటారు.**

భీమయ్య

మీ రెన్నన్న చెప్పిండ్రి. రక్తానికి రక్తం. ప్రాణానికి ప్రాణం గంతే, నారిగాన్ని ఖతం చెయ్యాల్నె గంతే,

రైతు

వాన్ని మొదలు అడ్డంగ నరికితేనే మనం మొగోల్లం

ప్రగతి

పిచ్చివాళ్లు, నారిగాడు అమాయకుడు

భీమయ్య

నువ్వు మస్తు చెప్పుతవు గనీ !

సంవాదం - పాట

**విడువనూ - ఆ నారిగాడిని నరుకక నే**
**విడువనూ**
**కడకు ఏమైపోయినా సరె**
**గడియలోపల అన్నవలెనే**
**వాడి పాడెను గట్టకుంటే**
**మేడి పట్టను నీళ్ల ముట్టను ॥విడు॥**

ప్రగతి

తలదన్నా - నిర్దోషిని వధియించ
తలదన్నా
కల్లు సారకు లొంగిపోయి
ఒళ్లు మరచిన దీనుడాతడు
కల్లకపటము తెలియనోడు
కుళ్లు కుట్రల నెరుగనోడు ॥తల॥

కృష్ణయ్య

దీనుడా ? - మన అన్నను బలిగొన్నవాడు
దీనుడా ?
కన్ను కదపను రెప్పవాల్చను
ఎన్ని చెప్పిన వినను వాడిని
మన్నులో కలిపేటి వరకు
అన్నమే విషమౌను నాకు ॥దీను॥

కృష్ణయ్య

కాదయ్యా - అసలైన హంతకుడు వాడు
కాదయ్యా
వాడు మాట్లాడేటి జంతువు
పొడిచి రమ్మన పొడిచి వచ్చెను
నీడ వలె ఎదురాడనోడు
నీడ లేని పేదవాడు ॥కాద॥

ప్రగతి

అంతేకాదు భీమన్నా !

మరచావా - పెద్దన్న చెప్పిన చివరిమాట
మరచావా ?

నారిగాన్నే మనక మీరలు
ఊరి ప్రజలను సిద్ధపరచి
దొరల పాలన కూల్చుమన్నది
తిరుగుబాటును లేపుమన్నది ॥మర॥

ప్రగతి

అయ్యా ! రైతు సోదరులంతా ఆవేశాలు మాని ఒక మాట వినండి. మన శత్రువు రామిరెడ్డి కాని, నారిగాడు కాడు, నా మాటలు మీకు బాధగా కోపంగా అనిపిస్తుండవచ్చు.

పాట

నారిగాడివి మీరు - తరిమి చంపెదరు
తరిమి చంపెదరు మరి - యేమి పొందెదరు
దొరల మోసము తెలియనోడివి
నారిగడివి నరికివేసిన
అమరుడగు మన అన్న యిప్పుడు
తిరిగి కనబడ బోడుగా ఇక ॥నారి॥

అన్న మాటలు మీ - రన్ని మరచినరు
అన్ని మరచినరు - సున్నజుట్టినరు
కన్నగానక తనను చంపిన
వాన్ని మీరలు తిరిగి చంపగ
ఎన్నడూ తలపెట్ట రాదని
ఎన్నొ చెప్పెను కనులు తడియగ ॥అన్న॥

ప్రగతి

ఒకదానికి సమాధానం చెప్పండి

రాయి తాకినచో ఆ - రాయిదా నేరం ?
రాయిదా నేరం ఆ - రాయిదా ఘోరం ?

రాయి విసిరిన రౌడి నొదలి
రాయినే కొట్టంగ తగునా ?
న్యాయముగ యోచించి దొరద
న్యాయమని తెలియంగలేర ? ॥రాయి॥

### కృష్ణయ్య

మన శత్రువు రామిరెడ్డి. పదండి అతని పైకి

రామిరెడ్డను ఈ - గ్రామ రాహువుచే
గ్రామ రాహువుచే - ధూమకేతువుచే
శ్రమలు తొలగే దినము వచ్చెను
యముడ నరువది వూళ్లకవి తెగ
శ్రమలు చెందే వాని బతుకును
మట్టిలో కలుపాలి మనము ॥రామి॥

### భీమయ్య

మరి అన్నను చంపినందుకు మనం 'బదులా' ఏం చెయ్యోద్దా? గాజులు పెట్టుకుందామా ?

### ప్రగతి

వద్దు. మీరు అంత పిరికివాళ్లు కావద్దు. పదండి. ఎందరెందరి రక్తంతోనో కట్టుకున్న ఆ గడిని నేలమట్టం చేయండి. ఆ గడిలో ఉన్న ప్రజల సొత్తంతా ప్రజలకు పంచిపెట్టండి.

### కృష్ణయ్య

నేటి నుంచి ఒక్కర్నిగూడ గడిలకు పనికి పోనివ్వకండి. గడి వాకిట్లో గడ్డి మొలవాలి. ఇంటికి చెదలు పట్టాలి.

## ప్రగతి

మన ప్రజల వేలిముద్రలు ఒత్తించుకొని వ్రాయించుకున్న వడ్డీ కాగితాల్ని, మన ఆస్తుల్ని కుదువ బెట్టుకున్న కాగితాల కట్టల్ని కాల్చి బూడిద చేయండి. మన భూముల్ని గుంజుకొని కులుకుతున్న ఆ దొర పట్టా భూముల్ని మొత్తం ఆక్రమించండి. ఏండ్లకొద్ది దున్నుకుంటున్న ఆ భూమి మనదే నని 'దున్నేవానిదే భూమి' అన్న సంఘం నినాదాన్ని నిజం చేయండి. పదండి దొర కరణం ఎవరైనా ప్రజాశక్తి ముందు కాగితం ముక్కల్లా, గడ్డిపోచల్లా కొట్టుక పోవాల్సిందే. పదండి

## కృష్ణయ్య

ఒక్క వూరేకాదు అరువై వూర్ల ప్రజాశక్తిని ఒక తాటిమీద నడిపించండి. నేటి నుంచే అన్ని వూళ్లల్లో ఈ గడి నేలమట్టం చేసే కార్యక్రమాన్ని అందించండి.

(నిష్క్రమిస్తారు)

## నారిగాని యిల్లు

## లచ్చి

తాగుడు పొడుగాను. ఎంత పని జేస్తివి బావా.

## నారిగాడు

నా అటువంటోడు బూమ్మీద ఉండొద్దు లచ్చి

## లచ్చి

నాగయ్య తండ్రీ! అయ్యో! ఎంత చల్లని మనసు నీది. అవుగని బావా!

## సంవాదం - పాట

సీతిమంతుని చంప
చేతులెట్లాడెనో - బావ నీకు
ఆ తల్లి శోకమ్ము
ఏ తీరు తగులునో - బావ నీకు

నారిగాడు

పిశాచి తలమీద
కూసున్నదో యేమొ - లచ్చి నాతు
ఆ పుణ్యవంతుని
అపుసు మింగితి - లచ్చి నేను

లచ్చి

ఊరందరు తన
వారంటు తిరిగిండు - చల్లనయ్య
పేరుపేరున అంద
రిని గౌరవించిండు - చల్లనయ్య

నారిగాడు

పేదోళ్లకు తాను
పెద్ద దిక్కుగ నిల్చె - చక్కనయ్య
బాధలెవరికి ఉన్న
భరియించుకొన్నాడు - చక్కనయ్య

లచ్చి

అంటరాని తనము
మంటలో గలిపిండు - చల్లనయ్య
అంటు లేదని మన
ఇంటిలో కొచ్చిండు - చల్లనయ్య

నారిగాడు

చీమనైనా తాను
ఏమి యనని తండ్రి - చక్కనయ్య
ప్రేమ మీరగ నన్ను
తమ్మియని పిలిచేది - చక్కనయ్య

లచ్చి

నిన్ను చంపుత నవి
భీమన్న అంటుంటే - ప్రగతమ్మ
వాన్ని చంపితె మనకు
అన్న రాడందట - ప్రగతమ్మ

నారిగాడు

అన్నను చంపినను
నన్ను బతికించిందా - ప్రగతమ్మ
ఎన్ని చేసినగాని
నీ రుణము తీరేనా - ప్రగతమ్మా!

లచ్చి

అన్న పేరు జెప్పి
నిన్ను కాపాడింది - ప్రగతమ్మ
తోబుట్టువై నేడు
నా బొట్టు నిలిపింది - ప్రగతమ్మ

నారిగాడు

భీమన్న పగతోని
సంపినా బాగుండు - లచ్చి నన్ను
హరి హరి యనుకుంట
నరకమ్ము పోదును - లచ్చి నేను

లచ్చి

పగ ఆయె ఊరంత
ఇగ మనకు దిక్కేది? - బావ నేడు
ప్రగతమ్మ పాదాల
మొక్కుతుందామయ్యా - బావ నేడు

లచ్చి బాగా దగ్గుతుంది

నారిగాడు

సాతాని పంతులు పసరు పోస్తుండా ? మరి యీ దగ్గు....,

లచ్చి

ఈ దగ్గు...., పసర్లకు తక్కువకాదు బావా. ఇది పానం తీస్కోనే పోతది....,
ఆ సాతాని పంతులు నాతోని కాదన్నడు

నారిగాడు

మరి పట్నం పోదామా ?

లచ్చి

ఇప్పటికి పిల్లలకు గంజిలేదు గని ఇంక పట్నం పోతాం. గిట్లనే కావలె. సస్తేనే
మంచిది.

నారిగాడు

గంత మాటెందు కంటవు. సస్తే నేను సావాలె. సరె గట్ల పొయ్యొస్త.

(నిష్క్రమిస్తారు)

దొర గడి. రామిరెడ్డి కూచోని వుంటాడు. నారిగాడు వచ్చి
కాళ్ళు పట్టుకుంటాడు.

రామిరెడ్డి

ఏమిరా ? "నెల నుంచి తిరుగుతున్న దొర నెట్లైన కలువాలె" అన్నవంట. ఏం
సంగతిరా మాదర్‌చోద్ ?

సంవాదం - పాట

నారిగాడు

దండమయ్యా ! పాదములకు
గండమొచ్చె నాకు - ఓ దొర !

ఊరు కూరు పగదలచెను ఇక
దొరా మీరే దిక్కు ॥దండ॥

రామిరెడ్డి

మనసు బాగలేదు - నన్ను
మంద లించవద్దు
సోది వినేందుకు ఓపిక లేదు
పది రోజుల వరకు ॥మన॥

నారిగాడు

నెల రోజుల నుంచీ తిరిగి
అలసి పోతినయ్యా - ఓ దొర!
పాటెకు సిద్ధం అయినదింటిది
పాడు రోగమయ్యా ॥నెల॥

రామిరెడ్డి

ఇంటిది చస్తేంది - ఇంటికి
ఇంకోతొస్తుంది
మంటిల బోయే దాని కోసమై
తంటికి సీరేలా? ॥ఇంటి॥

నారిగాడు

ఆటబొమ్మ కాదు తండ్రి
ఆడదంటె మాకు - ఓ దొర!
ఆలు కాదది అమ్మ నాకు
జాలి తలపవయ్యా ॥ఆట॥

రామిరెడ్డి

లేదుర నాయింట్ల - లేదు
రూపాయల చెట్టు
నీదు కేసులో మునిగినాయిరా
పది వేలిప్పటికే ॥లేదు॥

నారిగాడు

ఒక్క యాబై ఇయ్యండయ్య
దక్కనేమొ లచ్చి - ఓ దొర!
దిక్కు నాకు నీ వాదాలే
మొక్కుతాను తండ్రీ ॥ఒక్క॥

రామిరెడ్డి

భోషిడికే! నీకు - పైస
బాకి లేను పోరా
కసరు గక్కుతవు ఒక్క తన్నుకే
దాసి ముండ కొడుకా! ॥భోషి॥

నారిగాడు

సాదినా సంపిన మీరే
నా దేవుని వయ్యా - ఓ దొర!
పిల్లల గోస సూడలేను
తల్లి సచ్చి పోతే ॥సాది॥

రామిరెడ్డి

తాగి వచ్చినావా - చెప్పితె
తలకు ఎక్కలేదా?
మెడలు బట్టి గెంటించాలా మరి
మొద్దు లఫ్డి కొడుకా ॥తాగి॥

ఓరే! ఎవర్రా అక్కడ?

నారిగాడు

అయ్యా ! నా తోని పని వున్నప్పుడు గట్ల. పని అయినంక గిట్లనా దొరా ! అయ్యో ! మీ జాతి గిసొంటిదని నాగయ్య చెప్పింది నిజమే దొరా. నన్ను మెడలు వట్టి గెంటించకుండ్రి. నేనే పోత.

(నిష్క్రమిస్తాడు)

జనాన్ని సమీకరించి గడీని నేలమట్టం చేయడానికి ప్రగతి మొదలగువారు బయల్దేరుతారు. వీరిని చూసి దొర, కరణం పట్టణానికి పారిపోతారు.

ప్రగతి - పాట

ఎలుగెత్తి పిలిచిందిరా - తెలుగమ్మ దో
సిలి యెత్తి అడిగిందిరా - భారతమ్మ ॥ఎలు॥

తెల్లవానికి లొంగు - నల్లనైజామోని
కాళ్ళ వ్రేళ్ళకు మొక్కు - వేల రొక్కముగట్టి
తెలుగు పల్లెలు పట్టిరి - జాగిరుదార్లు
తెలుగుదేశము దోచిరి - రక్కసి దొరలు
తెలుగు బిడ్డల చెరచిరి - జమీందార్లు
పలు హింస లొనరించిరి - ప్రజలవి ప్రాణ
ములు కావని తలచిరి - ఊళ్లను కాష్ఠ
ముల వోలె మండించిరి - ఎదురాడిన
ఫలమింతే యని నవ్విరి - నెత్తురు తాగే
కులమోలె చరియించు - ఖలుల బురుజులనెల్ల
కూలగొట్టక ఇంక - ఏల ఆగెదరంచు ॥ఎలు॥

## కృష్ణయ్య

వేలి ముద్రలు పెట్టినం - చదువేమీ రాక
బోల శంకరులయ్యినం - మన కెరుకలేక ॥వేలి॥

వేలిముద్రలు చూపి - వేల రూకల బాకి
తేలుతున్నారంటు - తోలు తిరుగలదీసి
కీలూ కీలొడిలించిరి - ఇల్లమ్మి యిచ్చిన
చాల లేదని తిట్టిరి - వడ్డీల కిందనె
కలిసింది లెమ్మనిరి - భయపెట్టి మన భూ
ములు మావె పొమ్మనిరి - ఒక పైస యివ్వని
కూలోళ్ల గావించిరి - దొరసంచు కచ్చు
రాల ముందురికించిరి - ఇక మనము ప్రళయ
కాల రుద్రుల మౌదిరి - కడులంగ దొరలు
కలిసేరు గోదావరి - జాగు చేయక
వేలి ముద్రల కౌగి - తాల దగ్ధముజేసి
కాల రాయుదము ఈ - వేళ శత్రులనెల్ల ॥వేలి॥

## భీమయ్య

ఎక్కడివి దొరగారికి - ఈ పొలములన్ని
ఎక్కడివి పటువారికి - ఈ పట్టలన్ని ॥ఎక్క॥

ఒక్కరోజు కూడా - ఒక్క నిమిషము సేపు
దుక్కిదున్నబోవి - టక్కరి దొరలకు
చుక్కలంటే మేడలెక్కడివి - మనవెట్టి లేక
చెక్కుజెదరని బురుజు లెక్కడివి - మనయెడ్లు దున్నక
లెక్కతెలియని గరిసె లెక్కడివి - మన కండ కరగక
బొక్కమునిగే కండ లెక్కడివి - మన సెమట గారక
చక్కని పన్నీరు లెక్కడివి - మన నాక్రమించక
దిక్కు దెలియని భూము లెక్కడివి - మన పిరికిలేక

మొక్కవోని దర్ప మొక్కడిది - ఒక్క గుంపై
ఒక్క గొంతుగ దిక్కు - లన్నీ బెదరెటట్టు
ఎక్కడిది హక్కంటు - తొక్కి అడుగుండ్రింక ॥ఎక్క॥

## ప్రగతి

జై అంటూ రారండిర - సంఘమ్మున
సై అంటూ దూకండిర - సంగరమున ॥జై॥

దయ్యాల రాజ్యంల - అయ్యో ఇంకెన్నాళ్ల
మొయ్యలేని బతుకు - సుయ్యి వెతకుదాయె
నయమాయె పక్షులైన - సంకెళ్లలేవి
ఖైదీలమై పోతిమ - తెరవండి కళ్ళు
భయమేల ఎదలందున - వదలండి పిరికి
జయముంది మనముందున - రారండి ఉరికి
'ఇయ్యాల దినమందున' - గెలిచేము లేదా
వెయ్యేండ్లు బతుకొస్తిమా - ఏనాటికైనా
చెయి గలిపి సాధించమా - తెలగాణలోన
జయభేరి మ్రోగించమా - జనమూ కోరే
ప్రియమైన సుద్దాల - హనుమంతు కోపాగ్ని
గేయాలు పైప్లవ్య - శంఖాలై గర్జించే ॥జై॥

(నిష్క్రమిస్తారు)

## ప్రగతి యిల్లు

## సంవాదం - పాట

### శీతయ్య

దొరల కరణాల కా
కిరి చేయలేనమ్మ
కరుణించి కాపాడుమా - ఓ యమ్మా ॥కరు॥

ఊర వూర సంగమాయె
దొర గడీలకు ఒకడు రాడు
కోరి వచ్చితి సంగమందున
చేరి మీతో నుంట తల్లి ! ॥దొర॥

ప్రగతి

శీతన్న యిక నుంచి
మాతోనె వుండువు
సంతాపమును మానుమా - ఓ యన్నా ॥సంతా॥

ఎంత జేసిన దొరల కొలువుల
నుంత యైనా లాభముండదు
కొంత వెనుకకు పోతె పనికి
చింత బరిగెల దెబ్బలే కద ॥శీత॥

శీతయ్య

రేపటి నుంచే నే
నాపనికి వెళ్లను
ఉపవాసములు ఉన్నను - ఓ యమ్మా ॥ఉప॥

రేపు మాపనకుండ మేము
పూర్వకాలము నుండి చేస్తిమి
పాప మనదా దొరల జాతి
కోపమొస్తే పసుల రీతి ॥రేప॥

ప్రగతి

శీతన్న కొన్నాళ్లె
ఏ తీరుగైనను
ఆ తలమునసె వుండుమా - ఓ యన్నా ॥ఆత॥

పంతులయ్యది ప్లాను ఏమిటొ ?
మంతనా లేమేమి జరుగునొ
సుంత మాకు తెలుపుటకు నువ్వు
కొంత కాలము గడిచి పిడువకు ॥శిత॥

నారిగాని ఇల్లు

లచ్చి

బావా ! శిన్నబోయినవేంది ?

నారిగాడు

ఏం లేదు ?

లచ్చి

దొర దగ్గరికి పోతే తన్నొచ్చిండట గదా

నారిగాడు

ఎటు గాకుంటయితి. ఎంత పాపం ఐపాయెనే నా ఐత్కు.

లచ్చి

చేసుకునోళ్లకు చేసుకున్నంత. ఒక్క మాట చెప్పనా బావ ?

సంవాదం - పాట

చెడుపు కాలం దాపురించింది - నాగన్న తల్లి
కడుపు శోకం మనకు తగిలింది - నాయిన్నా మనకు
పాడు సారా కల్లుతోని
రౌడి దొరల మాటలు విని
ఇడుము లన్నీ తొలగించుటకు
నడుము గట్టిన నాయకుడిని
పొడిచి చంపిన పాపం తగిలింది - ఆ వుసురే యిపుడు
విడక నన్ను చంపుకపోతుంది - నాయిన్నా చూడు॥చెడు॥

నారిగాడు

ఎవరి కర్మ వారికి యంటారే - నా లచ్చీ! నీవు
ఎవరికేమి పాపం జేసితివే - నా లచ్చీ! నీవు
రక్ష చేసే దేవుళ్లైతే
శిక్షలు వేయాలి నాకు
మోక్షమిచ్చే దేవతలంతా
కక్ష నీపై తలచుటెందుకు?
దైవమే యిటు తప్పుచేసిందా - లేకుంటే నాదు
జీవ మిచ్చి నిను దక్కించేది - నా లచ్చీ చూడు ॥ఎవ॥

లచ్చి

దైవ మెప్పుడు తప్పులు పడదయ్యా - నాయిన్నా చూడు
చావు నాదీ ఏడుపు నీదయ్యా - నాయిన్నా చూడు
నీవు నేనూ వేరు కాదు
బావ మనము ఆలుమగలం
సగము పాలుగ నీతో నేను
సగము బతుకు గడిపినాను
తప్పు నేను చేశానని కాదు - ఈ దైవ ఘటన
తప్పు నీకు తెలియాలని యందు - నాయిన్నా నేను ॥దైవ॥

దేవుడు తప్పు చేయలేదు బావా! బాగా ఆలోచన చేసే శిక్ష నాకు వేసిండు. నువ్వు సచ్చిపోతే ఈ పిల్లలతోని ఎంతో గోస అవుతుండె నాకు. ఆ శిక్ష నీకు కావాలనే నాకు సావు తొందరగా రాసిండు.

నారిగాడు

ఎంత జ్ఞానము తెలిపినావమ్మా - నిను చేసుకోని
ఎంత పుణ్యం పొందినానమ్మా - నిను చేసుకోని
తప్పు నాదై శిక్ష నీదై
తప్పుకోని పోతున్నావు

అంత పనిని చేయించిన దొర
ఇంటికెల్లితె ఊడ్చి తన్నె
ఎందుగానీ వాడనైతినిగా - నువ్వు కూడా పోతే
ఇందు నాకు దిక్కే లేదమ్మా - నువు కూడా పోతే ॥ఎంత॥

లచ్చి

దిక్కు లేదని దిగులు పడకయ్యా - మన పేదోల్లకు
దిక్కు ఉన్నది తల్లి ప్రగతమ్మ - మన పేదోల్లకు
అన్నను నువు సంపినప్పుడు
అందరు నిను చంపవస్తే
వద్దు వద్దని అందరి నాపి
నాదు తాళిబొట్టు నిలిపే
విన్నా తప్పక మన్నించుతుంది - ఆ చల్లని తల్లి
విన్నా తానే కాపాడుతుంది - ఆ చల్లని తల్లి ॥దిక్కు॥

నారిగాడు

పగలు బూని సంపించినగానీ - నా లచ్చీ ! నేను
ప్రగతినే యిక శరణంటానమ్మా - నాలచ్చీ ! నేను
నీదు సల్లని మనసు మీద
నేను ఒట్టుపెడుతున్నాను
కల్లు సారా జోలికి పోను
కుళ్ల దొరల కడుపనె తొక్కను
సంగములనే పడి వుంటానమ్మా - నను నమ్మవమ్మ
సంగమునకై ప్రాణా లిస్తాను - నను నమ్మవమ్మ ॥పగ॥

లచ్చి ! నీ మొకం మొత్తం నల్లగయింది గద.

లచ్చి

ఏం కాలేదు బావా ! సరెగని పనికి పోతున్నవ !

## నారిగాడు

అవును పోయొస్త

## లచ్చి

తొందరగ రా. కల్లుకు పోయేవు

## నారిగాడు

పోనే లచ్చి ! చక్కగ ఇంటికే వస్త.

## (నిష్క్రమిస్తారు)

## లచ్చి పడుకొని ఉంటుంది నారిగాడు మళ్లీ ప్రవేశించి

దీపంల నూనె పొయ్యలేదా ఏందే? మెతుకంత అయింది పన్నవా? నిదురంటు ఉందో యేమో పిల్లల్తేరే లచ్చి? గంజి తాగెటందుకన్న చాతనైందా? నేను తాపిస్తగనిలే తాగి వచ్చిన అని అనుకుంటున్నావా ఏంది? అందుకనే మేల్కుండి కూడా మాట్లాడ్తుతలేవు గద .... ఇగో....,

## పాట

లేచి చూడమ్మా - తాగక
వచ్చి నానమ్మా ॥లేచి॥

వచ్చినానే తాగక నేను
మెచ్చుకొనవా లచ్చిమి నన్ను
ఇచ్చితంగా వచ్చిన పైసలు
తెచ్చినానే నీకిచ్చుటకు ॥లేచి॥

లచ్చి ! అమ్మో ! సల్లగయింది. లచ్చి ! లచ్చి ! పోయినవా ? అన్నట్టే సెప్పి ఎల్లె పోయినవ ?

ఎల్లిపోయినావా ? - నాకీ
పిల్లలను వదలి ॥ఎల్లి॥

మళ్లి నీవు రానేరావా ?
తల్లివై మము చూడలేవా !
ఎలుగునిచ్చే ఎన్నెల పిల్లా !
ఎలుగులో ఎలుగై పోయినవా ? ॥ఎల్లి॥

కదలు తున్నాదే - కన్నుల
మెదలు తున్నాదే ॥కద॥

వద్దు తాగే నారిగాదని
రద్దిపెట్టిరి నీ తలిదండ్రులు
పెద్దలను ఎదిరించి నీ వా
పొద్దు నన్నే మనువాడితివి ॥కద॥

లచ్చి ! లచ్చీ ! పోయినవ ? సెప్పినట్లే పోయినవా ?

(శవంతో నిష్క్రమిస్తాడు)

దీనంగా ఆలోచిస్తూ కూర్చొని ఉంటుంది రాధ

ప్రగతి స్వగతం

తన జీవితం అడవి గాచిన వెన్నెల అయిందనేమో ఎప్పుడు బాధతో ఉంటుంది రాధ పాపం! ఈ పిచ్చి రాధకు నా తమ్ముడు తనను ప్రేమిస్తున్నాడని తెలియదు సరే.... రాధా !

(రాధ ఉలిక్కిపడి)

ఆఁ ఏంటక్కా ?

ప్రగతి

ఏం లేదు. ఎందుకలా దీనంగా కూర్చున్నావు ?

రాధ

ఏం లేదక్కా !

ప్రగతి

ఏం లేదా ? ఏంలేంది ముఖంలో ఆ బాధ, కళ్లల్లో ఆ తడి ఎందుకు ? చూడు ఏదీ దాయక నాకు చెప్పు....

సంవాదం - పాట

మోము వాడెను నీ
కేమి యోచనలే ? ॥మోము॥

ఏమి యోచనలే నీ
కేమి చింతనలే
ఏమి చిత్ర మదేమి వింతయొ
ఆవరించిన దేమిటో మరి
రాధ ! నీవిటు బాధపడక
వేగ తెలుపగ రాదె నాకు ॥మోము॥

రాధ

లేవు దుఃఖములు మరి
లేవు వేదనలు ॥లేవు॥

లేవు వేదనలు మరి
లేవు శోధనలు
లేవు తల్లీ ! నాకు బాధలు
లేనె లేవే చింతనలు నీ
వేల నాకై వగచి వగచి
శోకమేమని పలుకరింతువు ॥లేవు॥

ప్రగతి

మనను రూపము నా
కమల గప్పెను మా ॥మన॥

కనుల గప్పకుమా నా
మనసు తిప్పకుమా
మానినీ! నీ మనోవ్యాధికి
మందు తెలుసును నేను విన్నాక
ఇంటిదానిని చేయు వరకు
కంటికీ విదురైన పోను ॥మన॥

## రాధ

అమ్మ! ఎంతమాట!.... వద్దమ్మ వద్దు.

మలిన పుష్పమును
మాల చేయకుము ॥మలి॥
మాల చేయకుము
జాలి చూపకుము
శీలహీనను తాళిబొట్టును
కోరుకోలేనమ్మ తల్లీ
బతుకనీ పోరాటమందున
పోతినా నా కంతె చాలు ॥మలి॥

## ప్రగతి

తప్పు రాధా! ఈ అభిప్రాయమే తప్పు. జీవితం చాలా విలువైంది. ఇంత నిరాశ పనికిరాదు. పోరాటంలో ప్రాణాలిచ్చినా నిరాశతో కాదు ఆశాహృదయంతో అర్పించాలి అయినా....

చేదు అనుభవము
కాదు శాశ్వతము ॥చేదు॥
కాదు శాశ్వతము
బాధ క్షణికము
హృదయమందున దాచి కొలిచే
నాథు డొకడున్నాడు వాడు

**మధురమోహన వంశినై నిను**
**కదలకుండా చేయు చూడు ॥చేదు॥**

సరేనా.... ఇకనైనా నిరాశ విడిచిపెట్టు

రాధ

ఎంటోనమ్మా. ఎడారిలో పూలు పూయించాలను కుంటున్నవు.

ప్రగతి హాస్యంగా

నీ యెడారి గుండెలోకి వలపువెల్లువ పొంగించి ఆనంద పుష్పాలు పూయించేవాడు తొందరలోనే వస్తాడులే

రాధ

పొండక్కా! మీదంతా.........

(ప్రగతి నిష్క్రమిస్తుంది)

కృష్ణయ్య ప్రవేశించి

రాధా! నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి

రాధ

నాతో ముఖ్య విషయమా?

కృష్ణయ్య

అవును. మన జీవితానికి సంబంధించింది.

రాధ

నాకేం తెలుస్తుంది

కృష్ణయ్య

సూటిగా ఒక టడుగుతాను. సమాధానం చెపుతావా?

రాధ

అడగండి

కృష్ణయ్య

నామీద నీ అభిప్రాయం ఏంటి?

రాధ

మీ మీద మంచి.... మంచివారనే....,

కృష్ణయ్య

నమ్మదగ్గ వ్యక్తినేనా నేను?

రాధ

ఎంతమాట నేను నమ్మక పోవడమేంటి?

కృష్ణయ్య

నిన్ను పెళ్లి చేసుకుందా మనుకుంటున్నాను ప్రగతక్క ఆశీర్వాదంతో

రాధ తడిసిన కళ్లతో

ఏంటి? నన్ను మీరు పెళ్లి.... నిజంగా.... నిజంగా....,

సంవాదం - పాట

కృష్ణయ్య

కలికి ! పలుకేల కరువాయె నీకు ?
పిలి కనులేల నీరాలు తొణకు

రాధ

గుండె తడి పొంగి కురిసింది మేఘం
నిండె కనులందు మీ జాలి రాగం

కృష్ణయ్య

జాలిపడి నిన్ను ప్రేమించలేదు
మాల వలె నిన్ను మెడవేసికొందు

రాధ

ఇసుకలో పడిన కుంకుమను నేను
పసుపు సూత్రాల నాశించలేను

కృష్ణయ్య

మంటిలో ఉన్న మణిదీప మీవు
ఇంటి దీపానివై వెలుగుతావు

రాధ

మలిగిపోనుంది ఈ దీన దీపం
కరచి నవ్వింది పాపాల సర్పం

కృష్ణయ్య

స్నేహ సుధలందు తేలింతు నిన్ను
మోహి అనబోకు ఈవేళ నన్ను

రాధ

ఇంత దయ నేను భరియించగలనా
అంత అర్హత నే తగని దాన

కృష్ణయ్య

భర్తగా నన్ను భరియించరాదా
అర్ధతనువుగ వర్ధిల్లరాధ

రాధ

ఏ దేవుడని నిన్ను నే కొలువ
ఏ దేవునికి లేదింత చలువ

కృష్ణయ్య

దేవుడని వేరు భావించబోకు
నీవు సగపాలువే యింక నాకు

రాధ

మరి మీ అక్కయ్యకు ...

కృష్ణయ్య

అక్క యిప్పటికే అర్థం చేసుకోవచ్చు. అయినా ఒక అభ్యుదయశీలగా మనల్ని ఆశీర్వదిస్తుంది. నేను అడుగుతానుగా. ఔనన్నా కాదన్నా నీవే నా భార్యవు సరేనా !

ప్రగతి కృష్ణయ్య మాట విని ప్రవేశించి

మీ ప్రేమనుచూసి సంతోషించే వాళ్లలో నేనే మొదటిదాన్ని. ప్రేమ మనసుకు సంబంధించింది. దానికి కులమతాలతోని, గతాలతోని పనిలేదు. మీ పెళ్లి తప్పక జరుగవలసిందే.

రాధ

మీ భీమన్న పెళ్లి కాకముందు ఎలా సాధ్యం?

ప్రగతి

కాను ఈ విషయాన్ని గురించి విమర్శలు కూడా రావచ్చు. సమయోచితంగా కలిసి వచ్చిన కార్యాన్ని సంప్రదాయం పేరిట వాయిదా వేయడం నాకు ఇష్టం ఉండదు.

హనుమయ్య, అన్నపూర్ణలు తెచ్చిన పూలదండల మార్పిడితో రాధ కృష్ణయ్యల వివాహం జరుగుతుంది. భీమయ్య కూడ వాళ్లను ఆశీర్వదిస్తాడు.

ప్రగతి యిల్లు

నారిగాడు ప్రవేశించి దుఃఖముతో

కందార్థం

నే చేసితి ఘోరమ్మును
నీచుడ నమ్మంచరాదు నిజముగ మీరే
నా చావును చేసిన సరె

నే చెడి యిటు వచ్చినాను
మిము వేడగను
మీ సంగము లోను
శిక్షించిన మీరే
రక్షించిన మీరే
నా పాపము ఫలితంగా
నా దీపము ఆరిపోయె
దిక్కులేని పక్షి వోలె
ఇక్కడకు వస్తినమ్మ ॥మిము॥

## భీమయ్య

రె నారిగా ఎంత ధైర్యంరా నీకు? మా యింట్లోనే అడుగుబెట్టినవులే. నీ
ంగులు దీస్తా

## ప్రగతి

ందర పడకన్నా. వీన్ని చంపినంత మాత్రాన చనిపోయిన మన నాగన్న
రిగి వస్తాడా!

## భీమయ్య

ఃః.... వీన్ని చంపితే నాగన్న రాడు. దొరను చంపితే మాత్రం వస్తాడా?
నీ....,

## కందార్థం

చంపించెను రెడ్డి దొరనె
చంపినదీ నారిగాడు చంపెద వీళ్లన్
చంపిన రాటో దన్నయ
చంపిన చల్లారును పగ
చంపక మాన - నేను
చచ్చి పోయినా - వీడు
సంఘములోనా - నేడు
చేర వచ్చెనా?

అన్నయ్యను చంపినోడు
ఉన్నవేళ సంపు మింక
మన్నులోన కలిసిపోవు
టన్నదింక నిజము పీళ్ల ॥చంప॥

## ప్రగతి

నారయ్య వేరు. రామిరెడ్డి వేరు. వీడు పావులా వాడబడినవాడు. పైగా తన తప్పు తెలుసుకొని మంచి దారిలోకి వచ్చినవాడు అంతేకాక....,

## కందార్థం

తన లచ్చిమి కను మూసెను
తనయులతో చేరవచ్చె తప్పుల నెరిగెన్
ఘన మితవిధి క్షమియింతము
గుణహీనుని రెడ్డిదొరను
మరువగరాదు - నా
రయ్యను వీడు - మన
విని వినుమన్న - మ
న్నించవె అన్న
ఊరిని ఉరిపెట్టకుండ
ఊరి దొరను పట్టింతును
తీర్చుకొ నాగన్న పగను
మార్చెద ఎర్రని చీరెను ॥మరు॥

అమ్మా ! నువు దేవతవు తల్లి ! నేను గూడా మీతోపాటే ఉంటానమ్మా ! లచ్చి సచ్చిపోంగ చెప్పింది కూడా గింతే ! రేపటినుంచే దొర సంగతులన్నీ బయి రంగం జేస్త.

(విశ్రమిస్తారు)

నారిగాడు ప్రవేశించి

పాట

దొరలే శనిభూతా లూ
రూరికి సోదరు లారా!
దొరలు ముందు గజదొంగలు
దొరికిన సొమ్మును ఎప్పుడు
తిరిగి యెవ్వరు దోయని
తీరుగ బురుజులు గట్టిరి ॥దొర॥

భూమెవ్వని సొత్తు కాదు
భూమినెవరు పుట్టించరు
భూమిని దున్నే మనకు
ఏమాత్రము భూమిలేదు
ఏమీ గారడి దొరది
భూమంతా పట్టాయె ॥భూమె॥

అధికార మ్మెవరికున్న
అదే పనిగ భజియింతురు
ఏదో జరిగి యీ నిజాము
అధికారము తొలిగినచో
ఇద్దరు టోపిని బెట్టి
గాంధి శిష్యుల మందురు ॥అధి॥

దొరలను గద్దెను దించే
ధీరుల సంగమునందున
మీరందరు చేరినచో
ఈ రణరంగము నందున
మనదే గెలుపని జనకవి
హనుమంతు సెలవిచ్చెను ॥దొర॥

(నిష్క్రమిస్తాడు)

## ప్రజలు ధ్వంసం చేసిన గడిలోకి దొర, కరణం చేరిన తర్వాత

### రామిరెడ్డి

కరణంగారు! ఒక్కడు రావడం లేదండి పనిలోకి. శీతడు పిలువబోతే రానం టుంద్రట గద.

### స్వామిరావు

ఆఁ వస్తరట గని. వాళ్ల సంఘముల నిర్ణయమైన కాడికి కూలిగట్టిస్తే వస్తరట. అది సరె గని వడ్డీ కాగితాలన్నీ మునిగినట్టేనా ?

### రామిరెడ్డి

ఒక్కటి లేకుండా గుమ్మెడు వడ్డీ పత్రాలను కాలబెట్టింద్రు.

### శీతయ్య

వడ్లు, పెసల్లు, కందులు అన్ని అర్తెవ్వి ఊర్లోల్లకు పంచింద్రు

### స్వామిరావు

అవిపోనిగనీ. మన భూములన్ని వాళ్లవేనట. పండిన వరి అంతా దులుపుక పోయింద్రు గద

### రామిరెడ్డి

నాగడు చచ్చినగనీ వాడు చెప్పిందే చెల్లింది కద

### స్వామిరావు

అంతా ప్రగతీ చెయ్యబట్టే దొరా !

### రామిరెడ్డి

గడి కొంత కూలగొట్టినా సరే గని ఇంట్లో ఆడవాళ్లను ఏమనలేదు.

### శీతయ్య

అమ్మా ! ప్రగతమ్మ అటువంటిది కాదు దొరసాన్ని ఒక్కమాట అనలేదు. ఎవ్వల్లను ఏమననియ్యలేదు.

స్వామిరావు

3 గని గా నీళ్ల చేదే సాకలోడు కూడా రాకుంట అయిండు గద

రామిరెడ్డి

ఎవంటి రోజులు పోయి ఎటువంటి రోజులు వచ్చె పటువారీ!

సంవాదం - పాట

రోజు లెటుల మారిపోయే
రాజుల భోగమ్మెటు పోయే
కాలమెంత మారిపోయేను - పటువారీగారు
కలల గూడ నేననుకోలేదు ॥పటు॥

స్వామిరావు

నిజము పలికినారు మీరు
ప్రజలు చాలా మారినారు
పనికి పైసలు ఇవ్వాలంటారు- అయ్యో దొరగారు!
మనకు వెట్టికి రామంటున్నారు ॥అయ్యో॥

రామిరెడ్డి

వాకిలూడ్చే దిక్కులేదు
పక్క వేసే మాటేలేదు
కాళ్లు పిసికే దాసిది కరువాయే - పటువారీగారు?
నీళ్ల చేదే మనిషే లేదాయే ॥పటు॥

స్వామిరావు

రోజు రోజు కూలి ఇస్తే
రోజు పనికి వస్తా రంట
మనిషి విలువలు పెరిగినాయంట - అయ్యో దొరగారు
మనకు వారికి తేడా లేదంట ॥అయ్యో॥

రామిరెడ్డి

లొంగి పోయి బ్రతుకలేము
దొంగ వెధవల పిలువలేము
ఉన్న వూరు వదలిపోదాము - పటువారిగారు
దున్నుకొని జీవించగా లేము ॥పటు॥

స్వామిరావు

రామ రామ! యెంతటి మాట
రామిరెడ్డిగారి నోట
భయము లేదు బస్తీ వెళతాను - రజకొర్ల రజ్వీ
ఖాయిసాబును కలిసి వస్తాను ॥రజ॥

రామిరెడ్డి

వాళ్ల వల్ల ఉపయోగ ముంటుందంటారా?

స్వామిరావు

ఇంక సందేహమా? మొత్తం బూడిద కాదండి

రామిరెడ్డి

సంఘముల చేరినోళ్లను
సంఘ పోళ్లకున్న యిళ్లను
విప్పు పెట్టి బూడిద చేయించు - ఆ ప్రగతిముండను
చెప్పుకింద నలిపి కవిపించు ॥అప్ర॥

ప్రగతి ఇల్లు

సీతయ్య ప్రవేశించి

అమ్మా! గోరం జరుగబోతుంది. ఉష్షారు గుండాల

ప్రగతి

ది శీతన్నా ?

శీతయ్య

ది పగతోని రజాకార్లను పిలుపిస్తుండు. సంగపోల్ల యిండ్లను, కాలపెట్టిస్త గిది చెప్పుదమని వచ్చిన

ప్రగతి

ఓ ! అలాగా ? పరవాలేదులే. మొత్తానికి ఈ విషయం చెప్పి సంఘానికి చేశావు శీతన్నా. శెబాష్.

(శీతయ్య నిష్క్రమిస్తాడు)

భీమయ్య, కృష్ణయ్య, రాధ, నారిగాడు ఇంకా రైతులు ప్రవేశిస్తారు

ప్రగతి ప్రజల్ని సమీకరించి

వరీ సోదరులారా ! మళ్లీ మనమంతా ఒకచోట కూడి సైన్యంలా తయారు లసిన అవసరం వచ్చింది.

కృష్ణయ్య

న నాయకులు నాకు భీమన్నకు నారయ్యకు గెరిల్లా శిక్షణ ఇచ్చినారు కదా, ని అవసరమయ్యే సమయం ఆసన్నమైంది.

నారిగాడు

జాకార్లకు తోడు దొర రౌడీలు కూడా వస్తరు. మనం గొడ్డలి, కొడవలి, రోకలి, త్తి, బల్లెం ఏదుంటే అది తీసుకొని తయారుగుండాల

ప్రగతి

డవాళ్లు కూడా నడుం గట్టండి. కత్తులు పట్టండి, కారం పొట్లాలు వెంట ఉంచు ండి. కాళికల్లాగా తయారు కండి

**రాధ**

గుప్పెడు కారంశ కండ్లల్ల చల్లుండ్రి. గుండెల్లో కత్తులు దించండ్రి

**ప్రగతి**

అందరూ సైన్యంలా మారి గుంపులు గుంపులుగా కాపలా కాయండి

**నారిగాడు**

ఆఁ! కండ్లల్ల నెత్తురు దెచ్చుకొని కాపలా కాయాలె

**(నిష్క్రమిస్తారు)**

**కొన్ని రోజుల పిదప**

**ప్రగతికి హనుమయ్య ఎదురుగా వచ్చి**

ప్రగతీ! ఘోరం జరిగింది తల్లీ!

**ప్రగతి**

ఏమైంది నాన్నా?

**హనుమయ్య**

రాత్రి మనింటికి ఎవరో గొళ్లెంపెట్టి తగులబెట్టిండ్రు

**ప్రగతి**

అమ్మో! అమ్మకేం ప్రమాదం కాలేదు గద.

**హనుమయ్య**

కాలేదు గని నారయ్యనే బతికేటట్టులేదు.

**ప్రగతి**

ఏమైందతనికి?

**హనుమయ్య**

కాల్తున్న ఇంట్లోకి వచ్చి నన్ను బయట దించి అమ్మను కూడా తీసుకొస్తుండగా దూలం మీదపడింది. మనిషి పూర్తిగా కాలిపోయిండు. నీ కోసం కలువరిస్తుండు

**ప్రగతి**

పదండి నాన్నా చూద్దాం.

**(నిష్క్రమిస్తారు)**

## నారిగాడు ప్రమాద స్థితిలో ఉంటాడు

### ప్రగతి

న్నా ! మేం ఎవరం ఊళ్ళో లేనప్పుడు ఎంత ఘోరం జరిగి పోయింది !

### నారిగాడు

లేదు తల్లీ ! మీరంతా మంచిగ ఉంటే నాకదే పదివేలు. నాగన్నను చంపి దుకు దేవుడు నాకు మంచి శిక్షనే ఇచ్చిండు.

### ప్రగతి

ంత మాటనకు నాగన్నా. పదండి పట్నం తీసుకెళ్దాం.

### నారిగాడు

ద్దమ్మా ! నన్నెక్కడికి తీసుకపోయినా బత్కను. నా పిల్లలకు ఇక నువ్వే క్కు తల్లీ ! వాళ్లకు తల్లివైనా తండ్రివైనా నువ్వే. ఇగ లచ్చి, నాగన్న ఉన్న డికి నేను పోత. దండం తల్లీ.

(నాగడు మరణిస్తాడు)

**నారిగాడు మరణించిన కొన్నాళ్లకు రామిరెడ్డి, కరణం పారిపోతుండగా జనం బంధిస్తుంది. అరవైవూర్ల జనం ఏకమై ప్రగతి నేతృత్వంలో రామాపురం లాల్ ఖానాకు ఆ ఇద్దరిని కట్టివేస్తారు.**

### ప్రగతి

హాఁ హ్హాఁ హ్హాఁ రామిరెడ్డీ ! నా ప్రతినలు తీరుట కల్ల మా సంఘాలను ఒక పుల్ల లాగా విరిచి వేస్తానన్నావు కదూ ? చూడు. ఆ అశేష జనాన్ని చూడు. నాగన్నను వెన్నుపోటు పొడిచి చంపించావు. నా అన్న, నా ప్రాణం, నా రక్తం, అనుక్షణం గుండెల్ని మండిస్తున్నా నిన్నింతదాక చంపించలేదు. చేతగాక కాదు రామిరెడ్డీ ! ఈ జనంలో విప్లవ చైతన్యం రావడం కోసం నా కోపాగ్నిని ఆలోచనగా మార్చుకున్నాను. చూడు అరవై వూర్లదొరా ! ఒక్కసారి కన్నెత్తి ఆ జన సముద్రాన్ని

చూడు. అందులో నువ్వెంత? ఎంత? ఒక్కొక్కరికి నువ్వెంత వస్తావు? అదిగో ఆవైపు చూడు నీ దోపిడికి గురైన వెట్టివాళ్లు. నరసింహాల్లా నా ఆజ్ఞ కోసం పగ్గాలమీద వున్నారు. మా నాగన్న చెప్పినట్లు నీ చరిత్ర మారింది. నేను నిన్నేమనను. నిన్నీజనానికే వదలివేస్తున్నా. నీవు పెట్టిన బాధలు అనుభవించిన వారికే నిన్ను శిక్షించే అధికారమిస్తున్నాను. ఏమిటి? వీళ్లు పుల్లలా? కాదు! కాదు! ప్రజలు పుల్లలెన్నటికీ కారు.

పాట

పుల్లల మంటివి కదరా - ఇదిగో పులి
పిల్లలయి వచ్చాయురా ॥ఇది॥
ఎల్లకాలము నీదే
చెల్లుతుందనుకోని
కల్లా కపటములేని
పల్లె జనులకు నువ్వు
బల్లెమోలే నిలిచినావురా - దినదినము మమ్ము
నల్లులోలే నలిపినావురా - మా యాదపడుచుల
గొల్లు మనగా చెరిచినావురా - ఇల్లాల్లనే వెల
యాళ్లగా నువు చేసినావురా - ఒక రక్కసివలె
తుళ్లి తుళ్లి నవ్వినవు గదరా
కళ్లలో కామమ్ముతో ప్రతి
పిల్ల పిల్లకు కన్నుగొట్టిన
కళ్లు రెండూ పెరికి ముప్పై
పళ్లు చెప్పున రాలగొడుదుము ॥పుల్ల॥

కృష్ణయ్య

కొంపలు ముంచావురా - ఎన్నెన్నో పుస్తెలు
తెంపి గర్వించావురా ॥ఎన్నె॥

పెంపు చేసి రౌడి బలగము
నింపితివి ఊరూర మొత్తము
చంపుదామని జనము నంత
దింపినావు రజాకార్లను
కుంపటైై దహియించినావురా - హృదయాలనెల్ల
రంపమయ్యి కోసినావురా - నైజాము రాజుకు
పెంపుడు కుక్కవైతివిరా - తెల్లోల్ల క్రింద
ఉంపుడుగత్తె వైతివిరా - మా శ్రమలు దోచి
తెంపరిదొర నంటివిరా
కంప ముళ్లగు మిమ్ములను ఛే
దింపగా చెయ్యెత్తి యిపుడే
దింపుడు కల్లాని కంపగ
గుంపు గూడి వచ్చినాము ॥కొంప॥

భీమయ్య

చిక్కన విప్పటికిరా - విప్లవంక వదలి
చిక్కుల్లో పడబోనురా ॥విప్లవం॥
దిక్కులేవి పేదవారే
దిక్కు తోచక తల్లడిల్లగ
దిక్కు తానుగ నిలిచి నీకు
ఉక్కు పిడుగై తోచినాదని
ఒక్కడగు నాగన్నను - నువు దొంగరాత్రిలో
బుక్క బెట్టించావురా - విను తొక్కి పట్టి
చెక్కన కసి దీరదురా - ఎన్నాళ్లనుంచో
చిక్కబట్టు కుంటినిరా - నీ తలకాయ
పక్కన పగుల గొట్టెదరా
ఇక్కడనె ఇప్పుడు నిన్ను

రక్కాసి రజాకారులు
పక్కీరు నిజామోడు
ఒక్కడు కాపాడలేడు ॥చిక్క॥

## వెట్టివాళ్ళు

ఎట్టి పనుల మంటివిరా - మమ్మందరిని
ఎట్టి బాధలు బెడితివిరా ? ॥మమ్మం॥

ఎట్టి శాకిరి సెయ్యలేకా
పుట్టినట్టి వూరు విడిసి
పట్నాలకు పారిపోతే
పిట్టలోలె పట్టు కొచ్చి
కట్టినావు లాలఖానకురా - కొరాలు జల్లి
కొట్టితే కొరడాలు తెగినయిరా - నాలెక్కండిపోతే
పట్టి మూత్రం దాపినావురా - నీకంటె యముడిం
కెట్టి నరకములోను లేదురా - విసు కొట్టడానికి
కష్టాలు ఎన్నెన్నయినా సాలయిరా
విట్ట విలువున నరికి నేదు
చుట్టుపట్టు ఊళ్లలో నీ
పొట్టపేగుల బలిని చల్లే
ఎట్టి బిడ్డల మొచ్చినమురా ॥ఎట్టి॥

రెచ్చిన జనం రామిరెడ్డిని, స్వామిరావును హతమారుస్తారు

ఆ తర్వాత కొన్నాళ్లకు

రాధ

ఏంటి ఆనందంగా వున్నారు?

## కృష్ణయ్య

ందంగా ఉండదా ఏం? దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అంతేకాక నైజాము
ా లొంగిపోయి చచ్చుకుంటూ తెలంగాణాన్ని వదిలేసినాడు. పత్రికా
తంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం పూర్తిగా లభించింది.

## రాధ

ఎందరో మహానాయకులు బలి అయ్యారు.

## కృష్ణయ్య

ంచంలో ఏ మార్పు వచ్చినా కొంత బలిదానం తప్పదు మరి.

## రాధ

గో ! ప్రగతి వదిన ఎర్రచీర మార్చి తెల్లచీరలో జనంతో వస్తుంది చూడు.

## కృష్ణయ్య

ను ప్రతిజ్ఞ నెరవేర్చుకుంది గదా అందుకే తిరిగి ఇన్నాళ్లకు తెల్ల చీర ధరిం
ది.

## తెరలో బోలో స్వతంత్ర భారత్‌కీ - జై

## పాట

## ప్రగతి - ప్రజలు

**జయగీతిక ఇక పాడరా చై**

**తన్య కాంతులెగయు - జగమంత మన**

**వీరచరిత తెలియు - ఆ నింగి నుండి**

**అరుణ కాంతి కురియ - చెంగల్వలన్ని**

**మురిసి మెరిసి విరియ**

గొంతులను ఎత్తండీ
చేతులను కలపండీ ॥జయ॥

తెల్లోడికి ఇక చెల్లెరా వం
దలేండ్ల అధికారం - దొరికింది మన
గాంధిసేవ ఫలితం - మన అల్లూరి చిం
దించె వేడి రక్తం - ఆజాదు భగ
త్సింగు ప్రాణత్యాగం
మన జెండా ఎగిరింది
మన తల్లి మురిసింది ॥తెల్లో॥

దొర చాకిరి యికలేదురా మన
కుంది కూలి హక్కు - కాదంటే ధి
క్కరించేటి హక్కు - మన భూమి మనమె
దున్నుకొనగ హక్కు - స్వాతంత్ర్యం మన
కున్న జన్మహక్కు
బెదిరింకా వదలండి
ఈ దేశం మనదండీ ॥దొర॥

తెలగాణలో పోరాడుచూ బలి
యైన సోదరులకు - జోతలివె
ధీర వనితలకును - జోహార్లు వీర
స్వర్గ వాసులకును - జేజేలు వీర
తెలంగాణమునకు
సుద్దాల కన్నీళ్ల
హారతుల నందించే ॥జయ॥

— సమాప్తం —